# ఆంధ్రలో రైతుఉద్యమం



రచన

నండూరి ప్రసాదరావు



ప్రజా ప్రచురణాలయం,
నారాయణగూడ, హైద్రాబాదు (దక్కన్)

# 3

# ఆంధ్ర రైతు ఉద్యమ ప్రారంభం

బ్రిటీషు సామ్రాజ్యవాదులు మన దేశాన్ని జయించినపిమ్మట మన దేశం లోని వ్యవసాయంలో మహా సంక్షోభం ఏర్పడింది. ఈ పరిపాలనా విధానంలో వ్యవసాయం అభివృద్ధి చెందటం లేదు సరికదా క్రమక్రమంగా క్షీణిస్తూవుంది. రైతుల ఆదాయం తగ్గిపోతూవుంది. అంతకంతకూ ఎక్కువమంది వ్యవ సాయంపై జీవించవలసి రావటంవల్ల భూమిపై భారం అధికమవుతూ వున్నది. కరువు కాటకాలు హెచ్చుతున్నవి. దీనికి కారణం ఏమిటి? సామ్రాజ్యవాద ప్రభుత్వం అనుసరించే వ్యావసాయిక విధానమే, ఏర్పర్చిన సామాజిక సంబం ధాలే ఈ వ్యవసాయ క్షీణతకు కారణాలు. ఈ విధానంక్రింద రైతులను క్రూరంగా దోపిడీచేసే పద్ధతి నిరాఘాటంగా సాగుతూవుంది. ఈ సామ్రాజ్యవాద ప్రభుత్వం యొక్క చల్లని నీడక్రింద జమీందార్లు, వడ్డీవ్యాపారులు, దళారులు, దొంగ వ్యాపారులు మున్నగు అనేకమంది దోపిడిగాండ్రు బైలుదేరి, జలగల్లాగా రైతుల, కూలీల రక్తమాంసాలను పీల్చుకుంటున్నారు. ఈ విధానంవల్ల రైతుల మీది భారం హెచ్చడమేగాక వారు రోజురోజుకూ దరిద్రులూ, ఋణగ్రస్తులూ అవుతున్నారు. తమ భూములను కోల్పోయి వ్యవసాయ కూలీలుగా తయారౌ తున్నారు. రైతాంగం తమ్ముతాము రక్షించుకోవాలంటే, వ్యవసాయాభివృద్ధిని గావించాలంటే దానికి పరిష్కారమార్గాన్ని అన్వేషించాలి. ప్రస్తుత పరిపాలనా విధానం క్రిందనే, ఈ వ్యావసాయిక పునర్నిర్మాణం సాధ్యంకాదు. ప్రస్తుత సామాజిక సంబంధాలిట్లేవుండి జమీందార్లు, వడ్డీవ్యాపారులు, దొంగవ్యాపారులూ తమ దోపిడీవిధానాన్ని కొనసాగిస్తూవుంటే కోట్లకొలదిగావున్న రైతుల జీవిత సమస్య వారి కనుకూలంగా పరిష్కారం కానేరదు.

వ్యవసాయం అభివృద్ధిజెందాలంటే బ్రహ్మాండమగు మార్పులు ఎంతో అవసరం. ఈనాడు భూమికి సంబంధించిన సామాజిక సంబంధాలను అనగా భూమిపంపక విధానమునూ, భూస్వామ్య విధానమునూ పూర్తిగా మార్పు చేయాలి. ఇందుకై తీవ్రమగు రైతాంగ పోరాటములను సాగించాలి. రైతు వుద్యమం జాతీయోద్యమంలో ఒక భాగంగావుంటూ నేటిసామాజిక బాంధవ్యా లకు మూలకందముగావున్న సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని కూలద్రోయాలి. ఈ కర్తవ్యమే రైతుసంఘాల ప్రాదుర్భావానికి కారణం.

బ్రిటిషు సామ్రాజ్యంవాదంవల్ల నలిగిపోయే ఆంధ్రరైతులు గత శతాబ్దం లోనే తిరుగుబాటులు సాగించారు. కాని అవి కేవలం ఉద్రేకంవల్ల వచ్చిన తిరుగుబాటులుగానే అంతమైనాయిగాని ఒక సంఘటిత రూపాన్ని దాల్చలేదు. ఒక వుద్యమంగా ప్రారంభంకాలేదు. 1920 లో కాంగ్రెసు ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమం ఆంధ్ర రైతాంగములో జాగృతి కల్గజేసింది. రైతాంగం మొట్టమొదటిసారిగా ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు రాజకీయరంగంలో ప్రవేశించింది. పెదనందిపాడులో పల్నాడులో తీవ్రమగు పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభమైంది. 100 కి 5 రూపాయలు చొప్పునకూడా పన్నులు వసూలు కాలేదు. కాని కాంగ్రెసు ఆజ్ఞప్రకారం ఈ వుద్యమం అంతరించిపోయింది. ప్రభుత్వం దారుణంగా ప్రజలను అణచివేసింది. పల్నాడు నాయకుడగు కన్నెగంతు హనుమంతును కాల్చిపారవేసంది. అయినా రైతులలోపుట్టిన అగ్ని చల్లారలేదు. అక్కడక్కడా రైతుసంఘాలు ఏర్పడసాగాయి. కాని వీటి నాయకత్వం కొద్దిమంది పెద్దభూస్వాముల చేతులలో వుండటంవల్లా, వారు శాసన సభలలోనూ రాజకీయాలలోనూ పదవులు, పెత్తనం సంపాదించుకొనుటకై వీటిని ఊతగా తీసుకొనుటకే వీటిలో ఉండటంవల్లనూ ఈ రైతుసంఘాలంతగా పెంపొందలేదు కాని నానాటికి దేశంలో జాతీయోద్యమం బలపడుతూ గ్రామ సీమలలోనికి వ్యాపిస్తున్నకొలదీ రైతాంగం అంతకంతకూ చైతన్యంపొందటం, సంఘాలేర్పడటం సాగింది. 1928 నాటకి చాలా జిల్లాలలో బలహీనమైన వైనప్పటికీ జిల్లా రైతుసంఘాలేర్పడటం ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం ఏర్పడటం జరిగింది. 1931 లో ఉభయ గోదావరులు కృష్ణాజిల్లాలలో ప్రభుత్వం విధించమన్న రీసెటిల్మెంటు రేట్లకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన శిస్తుల నిరాకరణోద్యమం సాగింద. రైతుసంఘాల నాయకత్వాన ప్రత్యక్షంగా ప్రభుత్వంతో జరిగిన ప్రధమ పోరాటం యిదే. కీ. శే కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి గారి నాయకత్వాన రైతు స్వచ్ఛంద సేవకదళము లేర్పడి ఈ పోరాటాన్ని సాగించినవి. ఫలితంగా ప్రభుత్వం లొంగివచ్చింది. రీశెటిల్మెంటు రేట్లను అమలుబర్చటాన్ని వాయిదా వేసింది. కాని ఈ పోరాటంపిమ్మట రైతుసంఘాలు వీటికృషి జాతీయోద్యమం వెనుక మరుగుబడి పోయినవి. రైతుసంఘాలలో తగాదాలు హెచ్చినవి. కీ॥ శే॥ రామదాసు పంతులుగారి నాయకత్వాన మితవాదుల ముఠా, గోగినేని రంగనాయకులు నాయకత్వాన అవకాశవాదుల ముఠా రాష్ట్రసంఘాన్ని స్వాధీన పర్చుకొంటానికై తగవులాడ జొచ్చినవి. రంగా రైతురక్షణ సంఘమంటూ ఒక జేబు సంఘాన్ని సృష్టించి నాటకమాడ

నారంభించాడు. రైతు సంఘాల పలుకుబడితో కాంగ్రెసును వశపర్చుకోవాలనీ, కాంగ్రెసు నాయకత్వమును లాక్కోవాలనీ రంగనాయకులు ప్రయత్నాలు సాగించాడు. 1934 లో కాంగ్రెసు శాసనోల్లంఘనాన్ని పూర్తిగా ఉపసంహరించు నాటికి ఆంధ్ర రైతువుద్యమం ఈ స్థితిలో వున్నది.

## రైతు ఉద్యమంలో కమ్యూనిస్టుల ప్రవేశం

కాంగ్రెసు పోరాటంలో పాల్గొన్న అనేక మంది యువకులు జైళ్ళనుండి బయటకురాగానే, నూతన పోరాటపద్ధతుల నవలంబించటంద్వారానే స్వాతంత్ర పోరాటం జయప్రద మౌతుందని గ్రహించారు. స్వాతంత్రమంటే బ్రిటీషు ప్రభుత్వాన్ని తొలగించటమే గాక, ప్రజా సామాన్యాన్ని కూడ ఆర్థిక దోపిడీనుండి విముక్తిగావించి వారి జీవన పరిమాణాన్ని వృద్ధిజేయాలనీ. అదే నిజమైన స్వాతంత్రమనీ వీరు తెలుసుకున్నారు. నేటి సమాజం దోపిడీ పద్ధతులపై నిర్మింపబడి వున్నదనీ, ఈ దోపిడీ విధానాన్ని తొలగించుటకై సోషలిస్టు పద్ధతులూ, పాలసీయే సరియైనవని గుర్తించారు. రైతులనూ, వ్యవసాయ కూలీలనూ, కార్మికులనూ, విద్యార్థులనూ, యువజనులనూ, స్త్రీలను వారి వారి సంఘాలలో సంఘటితపర్చి, వారి వారి దైనందిన కష్టాల నివారణకొరకై, కనీస హక్కుల కొరకై పోరాటాలు సల్పటం ద్వారానే చైతన్య హీనులుగా పడివున్న అశేష జనసామాన్యాన్ని రాజకీయోద్యమంలోనికి తీసుకు రాగలమనీ, అప్పుడే జాతీయోద్యమం భారత ప్రజలందరి ఐక్యపోరాటంగా వృద్ధిపొందుతుందనీ, అదే సరియగు పోరాట మార్గమనీ వీరు గ్రహించారు. అందుచే ఈ సోషలిస్టులు కార్మిక సంఘాలనూ, వ్యవసాయకూలీ సంఘాలనూ, రైతుసంఘాలనూ, యువజన సంఘాలనూ గట్టి పునాదులపై, ప్రజాతంత్ర సూత్రాలపై నిర్మించి పనిచేయ ప్రారంభించారు. ఇట్టి సోషలిస్టు లందరూ కలిసి కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించారు. వీరిలో అధిక సంఖ్యాకులు అప్పటికే కమ్యూనిస్టుపార్టీ సభ్యులు.

ఈ నూతనశక్తి రైతురంగంలో ప్రవేశించటంతో రైతు ఉద్యమంలో బ్రహ్మాండమగు మార్పు వచ్చింది. అంతవరకూ ఏ రంగనాయకుల జేబులోనో ఉండే సంఘం ఇప్పుడు ప్రజాసంఘంగా అభివృద్ధికా నారంభించింది. గ్రామ గ్రామాన రైతుసంఘ సభ్యులను విరివిగా జేర్పించి గ్రామ సంఘాలను ఏర్పర్చటం, వీటిని నడుపుటకై తాలూకా, జిల్లాసంఘా లేర్పడటం, సక్రమ మగు ఆఫీసు లేర్పడటం, పకడ్బందీగా వ్యవహారాలు నడవటం, తమ కాలం యావత్తు రైతాంగసేవలో వినియోగించు సేవకులు ముందుకు రావటం జరిగింది. రైతుల

యొక్క దైనందినకోర్కెలకై తీవ్రమగు ఆందోళనప్రారంభమైంది ఆంధ్రరైతాంగంలో ఒక నూతనసంచలనం బైలుదేరింది. దాని ఫలితంగానే 1936 లో ఆంధ్ర రాష్ట్రరైతుసంఘానికి కీ శే కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు ప్రధాన కార్యదర్శిగాను, చలసాని వాసుదేవరావుగారు సహాయకార్యదర్శిగాను ఎన్నుకోబడటం, 1937లో వీరిరువురే అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా ఎన్నుకోబడటం జరిగింది. ఇంతవరకూ వెనుకబడివున్న తూ॥గో॥లో కామ్రేడ్స్ ప్రసాదరావు, కొరపాటి పట్టాభిరామయ్య, పెన్మెత్స సూర్యనారాయణరాజు ప॥గో॥లో గారపాటి సత్యనారాయణ, పేటేటి వెంకటరత్నం, భూపతిరాజు లక్ష్మీనర్సరాజు నెల్లూరు జిల్లాలో బస్వారెడ్డి శంకరయ్య మున్నగువారు ఇతర రైతుపెద్దల సహకారంతో రైతు సంఘాలను నిర్మించి వుద్యమాన్ని ముందుకుతీసుకొని పోనారంభించారు. మారుమూల గ్రామాలలో సహితం ఈ ఉద్యమం ప్రబలిపోసాగింది. ఊరూరా ఎఱ్ఱజండాలు ఎగరటం ప్రారంభమైంది.

## రాష్ట్ర రైతురక్షణయాత్ర - సంఘటిత రైతువుద్యమ ప్రారంభం

అది 1937. నూతన రాజ్యాంగ సంస్కరణలు అమలులోనికి వచ్చినవి. కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొని అత్యధిక సంఖ్యాబలంతో గెలుపొందింది. కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పటంద్వారా తమ కష్టాలు పోగొట్టబడుననీ, తమ హక్కులు గుర్తింపబడుననీ రైతాంగంలో ఎంతో ఉత్సాహంవచ్చి జమీందార్లు మున్నగు వారెన్ని కష్టాలు కల్గజేసినా భయపడక కాంగ్రెసుకు తమ ఓట్లనిచ్చి గెల్పించారు. మూలమూలలా రైతు సంఘాలు బయలుదేరి తమ నెత్తిపైనున్న బరువులను (జమీందార్లు, అప్పులబాధ, శిస్తులబాధ) దించివేయటానికై ఆందోళన సాగించారు. కాంగ్రెసు ఉద్యమం బ్రహ్మాండమైన వుద్యమంగా, ఐక్యపోరాట వుద్యమంగా అభివృద్ధికానారంభించింది.

ఈ విధంగా రాష్ట్రంలో నలుమూలలా రైతాంగంలో కల్గుతున్న అపూర్వమగు సంచలనాన్ని ఏకీకృతమొనర్చి, బలమగు రైతువుద్యమాన్ని నిర్మించుటకూ, రాష్ట్రవ్యాపితమగు పోరాటాలను సాగించుటకూ, రాష్ట్రమంతటాయున్న రైతాంగముయొక్క కష్టాలను గూర్చి స్వయంగా పరిశీలించి, ఒక నివేదికను తయారుచేసి మంత్రివర్గానికి సమర్పించటంద్వారా మంత్రివర్గంకూడా తమ వుద్యమానికితోడుగా సంస్కరణలను ప్రవేశపెట్టునట్లు చేయుటకూ రాష్ట్ర రైతురక్షణయాత్ర జరుపుటకు నిశ్చయింపబడినది. ఈ యాత్రాదళమునకు నాయకుడుగా కీ. శే. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, ఉపనాయకుడుగా కామ్రేడ్ చలసాని

వాసుదేవరావు నియుక్తులైనారు. ఈ యాత్రాదళం ఆంధ్రదేశం వుత్తర కొన నున్న ఇచ్ఛాపురంనుండి బయలుదేరి కాలినడకను 1512 మైళ్లూ, బస్సులమీద 542 మైళ్లూ 130 దినములు ప్రయాణంచేసి, ఉభయ విశాఖ, ఉభయ గోదావరులూ, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో సంచారంచేసి 27-3-38 న మద్రాసు జేరుకున్నారు. ఈదళము 525 గ్రామాలు స్వయంగావెళ్ళి దాదాపు 25,000 సంతకాలు గల 800 దరఖాస్తులను ప్రోగుజేసుకొని వచ్చింది. వీటితో బాటు స్థానిక ఇబ్బందులనుగూర్చి రైతులు పెట్టుకున్న 300 అర్జీలను కూడా తెచ్చింది. మొత్తంమీద 600 గ్రామాలలో సభలూ, 60 ఫిర్కా, తాలూకా రైతు సభలూ, యీ యాత్రాదళం ఆధ్వర్యాన జరుపబడినవి. దాదాపు 4,50,000 ప్రజలు ఈ సభలకు హాజరైనారు.

ఈ రాష్ట్ర రైతుయాత్ర ఆంధ్రరైతు ఉద్యమ చరిత్రలో ఒక చరిత్రాత్మక ఘట్టం. ఈ యాత్రవల్ల అనేకమంది రైతు యువకులు రైతు ఉద్యమంలో తమ జీవితాన్ని అర్పిస్తానికై ముందుకు వచ్చారు. అనేక మంది కాంగ్రెసు వాదులు రైతుల హక్కులను గుర్తించి నాటికై పోరాడుటకై దీక్ష గైకొన్నారు. అనేక గ్రామ, తాలూకా, జిల్లా కాంగ్రెసు సంఘాలు ఈ యాత్రాదళానికి స్వాగతము లర్పించి పూర్తి సహాయాన్ని గావించాయి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం సహితం రైతాంగముయొక్క కనీస కోర్కెలను అంగీకరించి, వాటిని వెంటనే నెరవేర్చవలెనని మంత్రివర్గమును కోరియున్నది. ఈ యాత్రఫలితంగా మారుమూల ప్రదేశాలలో సహితం, మన్య ప్రాంతాలలో సహితం కల్గిన చైతన్యం ఫలితంగా రైతు ఉద్యమం వురకలు వేసుకుంటూ ముందుకు సాగిపోనారంభించింది. 1938, 39 లలో జరిగిన అసంఖ్యాకమగు రైతు పోరాటాలు ఈ యాత్రవల్ల కల్గిన చైతన్య రూపములే.

# కాశీపట్నం రైతుపోరాటం

1937 శాసనసభల ఎన్నికలలో, కాంగ్రెసు, అఖండవిజయం పొందిన పిమ్మట జులై నెలలో మంత్రివర్గాలు స్వీకరించింది. శాసన సభలలో ఎందుకు ప్రవేశిస్తున్నదీ కాంగ్రెసు స్పష్టంగా తెలియజేసింది. బ్రిటీషు ప్రభుత్వం మన దేశంపై రుద్దిన నూతన రాజ్యాంగ చట్టాన్ని భగ్నం చేస్తానికే శాసన సభలలో ప్రవేశిస్తున్నామనీ, శాసనసభలలో ప్రజల సమస్యలను పరిష్కారించుటకై కృషి జేస్తామనీ కాంగ్రెసు స్పష్టంగా ప్రకటించింది. ఇందుకై శాసనసభల ద్వారాను శాసనసభల వెలుపలనూ పోరాటాలు సాగించాలని కూడా కాంగ్రెసు స్పష్టం జేసింది. కాని మంత్రివర్గాలు స్వీకరించిన పిమ్మట ఇలాంటి పాలసీని కాంగ్రెసు అనుసరించలేదు. మంత్రివర్గాలు చేసిన స్వల్పసంస్కరణలూ సామ్రాజ్యవాదం అధికారంయొక్క, దోపిడియొక్క పునాదులనుగాని, ప్రజా సామాన్యంయొక్క దరిద్రానికి మూలకారణాలను గాని తాకనేలేదు. పైగా, ఈ సంస్కరణలను చేసినందుకు ప్రత్యామ్నాయంగా అధికారంలోవున్న కాంగ్రెసు మంత్రులు రోజు రోజుకూ బహిరంగంగా ప్రజా బాహుళ్యానికి వ్యతిరేకంగా, సామ్రాజ్యవాద పరిపాలనయొక్క అంగములుగా ప్రవర్తించసాగారు. ఇందువల్ల జాతీయ వుద్యమంలో నూతన సంక్షోభం బయలుదేరింది. వృద్ధియగుచున్న కార్మిక కర్షక ప్రజా పోరాటాలకు మంత్రివర్గాలు కాంగ్రెసు మితవాద నాయకత్వం, స్పష్టమైన ప్రతికూలతను అంతకంతకూ ఎక్కువగా చూపసాగిననూ కమ్యూనిస్టుల యొక్క, కాంగ్రెసులోని అతివాద శక్తులయొక్క నాయకత్వాన ఈ పోరాటాలు మరింత తీవ్రగతిని నడవసాగినవి. దీని స్పష్టరూపం ఆంధ్రదేశంలో కాశీపట్నం రైతుల పోరాటంలో కన్పిస్తుంది.

కాశీపట్నం వ.గో. జిల్లా నర్సాపురం తాలూకాలో ఒక గ్రామం ఈ గ్రామంలో అనాదినుండీ చేపలను పట్టుకొని జీవనం గడుపుతూవున్న వందల కొద్దీ రైతు కుటుంబాలు అనేక మాసాలనుంచి జమీందారు అక్రమచర్యలకు గురియౌతున్నవి. రైతులకు 800 ఎ॥ల భూమిని వ్రాసి యిస్తానని మధ్యపెట్టి జమీందారు పంటకాలవ వొకదానిని మంజూరు చేయించుకొని, కాలువ పూర్తి అయాక భూమి యావత్తు తనదేనని దాన్ని అమ్ముకోవడం ప్రారంభించాడు. రైతులు చేపలు పట్టుకొనడానికి గాని పేద్యం చేసుకుంటానికి గాని హక్కులేకుండా పోయింది. జమీందారు ఈ గ్రామంలో 144 సెక్షన్ యిప్పించి పోలీసుల సహా

యంతో భూముల కొల్తలను ప్రారంభించారు. రైతులు తప్పనిసరిగా పోరాటానికి తయారుకావలసి వచ్చింది.

ప గో. జిల్లా రైతుసంఘం, నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీలు రైతులకు నాయకత్వం వహించినవి. జిల్లా రైతు సంఘాధ్యక్షుడు కామ్రేడ్ భూపతిరాజు లక్ష్మీనర్సరాజు పోరాటాన్ని నడిపాడు. 7–3–39 న జమీందారు పోలీసుల సహాయంతో భూములు కొలుస్తూవుంటే సుమారు 300 మంది రైతులు శాంతంగా ప్రతిఘటించి సత్యాగ్రహంచేయ బయలుదేరారు. వారిలో 50 మంది స్త్రీలు కూడా వున్నారు. పోలీసులు ప్రధమంలోనే లక్ష్మీనర్సరాజుగారినీ, కమ్యూనిస్టు ప్రముఖుడగు కామ్రేడ్ సంకు అప్పారావునూ అరెస్టుచేసి, భూములు రైతులవికావు కాబట్టి వారి నందరినీ వెళ్ళిపొమ్మనగా రైతులు విరాకరించారు. పోలీసులు 32 రను అరెస్టుచేసి, సంకెళ్ళువేసి తీసుకొని పోయారు. 8 వ తేదీన మరల సత్యాగ్రహం జరిగింది. ఆనాడు క్రూరమగు లాఠీచార్జి జరిగింది. స్త్రీలకు కూడా దెబ్బలు తగిలినవి ఒక ముసలి రైతుకు రక్తంప్రవహించే గాయాలు తగిలినవి. వెంకటరత్నం అనే వాలంటీరు స్పృహతప్పి పడిపోయాడు. అయినా పోలీసులు అరెస్టుచేసి తీసుకొనిపోయారు. 9 వ తేదీన, కామ్రేడ్సు ఉద్దరాజు మాణిక్యాంబ, అన్నపూర్ణాదేవిల నాయకత్వంక్రింద 400 మంది సత్యాగ్రహం చేసారు. మాణిక్యాంబ, అన్నపూర్ణాదేవిగార్లు 40 మంది రైతులూ అరెస్టు కాబడ్డారు. 10 వ తేదీన మరల సత్యాగ్రహం జరిగింది. 20 మంది స్త్రీలు అరెస్టుగావింపబడ్డారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షునియొక్క, ప్రధాన మంత్రి రాజాజీయొక్క సలహాపై 12 వ తేదీన సత్యాగ్రహం విరమింప బడింది.

ఈ సత్యాగ్రహం ఏ విధంగా క్రూరంగా అణచి వేయబడుటకు పోలీసులు ప్రయత్నించినదీ కామ్రేడ్ మాణిక్యాంబ మరితరులూ కోర్టులోఇచ్చిన వాఙ్మూలం ప్రకారం విదితం కా గలదు.

"రాష్ట్రములందు స్వపరిపాలనము చేకూరినదని ప్రజలలో కొందరు చెప్పుకొను ఈ దినములలోనైననూ అధికారుల దృక్పధము మారునని ఆశించితిమి కాంగ్రెసు మంత్రివర్గము అధికారములోనికి వచ్చి దాదాపు రెండు సంవత్సరాలైనది. కాని అధికారుల దుండగములు తగ్గలేదు. లంచగొండులసంఖ్య మితిమీరుచున్నది. ఈ మధ్య కాశీపట్నంలో నిరాయుధులగు బీదరైతులనూ, రైతులలో ముసలివారినీ స్త్రీలనూ గర్భిణీస్త్రీలనూ, పోలీసు నౌకరులు లాఠీలతో నిర్దాక్షిణ్యముగా కొట్టినారు. త్రివర్ణపతాకమును ఒక బాలునిచేతిలోనుండి పోలీ

సులు లాగి చింపివేసి, బురదలో పూరద్రొక్కిరి. డిప్యూటీ సూపర్నెంటు ఒక ముసలిపేదరైతును బూటుకాలితోతన్నెను. అనరాని మాటలు అనెను. అమానుష కృత్యములుచేయు అధికారులను వుద్యోగమునుంచి తొలగించినగాని దేశమున శాంతిచేకూరదు. జమీందారుని తృప్తిపరచు స్థానికోద్యోగులు ఇట్టి చర్యలకు పాల్పడుట మిగుల విచారకరము...."

కాశీపట్నములో రైతులు గావించిన ఈ పోరాటానికి రాష్ట్రంనలుమూలల నుండీ రైతుసంఘాలూ, కాంగ్రెసు సంఘాలూ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలూ విశేషమగు సానుభూతిని తెలియజేసినవి. ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాధ్యక్షుడు కీ. శే. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు, రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి కామ్రేడ్ సుందరయ్య కలిసి 26-1-39న కాశీపట్నం రైతుదినోత్సవం జరుపవలసినదిగా విజ్ఞప్తి జేసారు. ఆనాడు ఆంధ్రదేశంలో అనేక గ్రామాలలో సభలు జరిపి. పోలీసులుగావించిన అమానుష కృత్యముల నిరశిస్తూ రైతు హక్కులను గుర్తించ వలసినదిగా ప్రభుత్వమును కోరుతూ తీర్మానాలు గావింపబడినవి. నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీ, ప.గో. జిల్లా కాంగ్రెసుకమిటీలు రైతులహక్కులను పూర్తిగా బలపర్చినవి. ప.గో. జిల్లా నుండి ఎన్నుకోబడిన ఇద్దరు కాంగ్రెసు శాసనసభ్యులూకూడా రైతులకోర్కెలు న్యాయమైనవనీ, వాటిని నెరవేర్చ వలసినదనీ కోరుతూ ఒక మెమోరాండమును ప్రభుత్వానికి సమర్పించారు.

## పోరాటంయెడ కాంగ్రెసువైఖరి - సోషలిస్టుల వైఖరి

కాని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులయిన డా॥ పట్టాభి, రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ ఈ విషయంలో ఆశ్చర్య కరమగు విధంగా ప్రవర్తించారు. త్రిపురీ కాంగ్రెసునుండి డా॥ పట్టాభి తాము యీ సమస్యను పరిష్కరిస్తామని హామీ యిస్తూ టెలిగ్రాం యివ్వటం మూలంగా సత్యాగ్రహం విరమించబడింది. కాని డా॥ పట్టాభి కాశీపట్నం వెళ్ళనే లేదు. తాను కాశీపట్నం వస్తే రైతులకు బలంచేకూరుతుంది కాబట్టి అక్కడికి వెళ్ళలేదని స్పష్టంగా తాలూకా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడగు కామ్రేడ్ ఉద్దరాజురామంకు తెలియ జేసాడు. అక్కడి రైతుల పోరాటం వ్యక్తిగత ఆస్తుల్ని నాశనం గావించే పోరాటమనీ, ఆ రైతులు గెలిస్తే వ్యక్తిగత ఆస్తులేమీ ఇక ముందు విలువనికూడా ఈయన స్పష్టంగా చెప్పాడు. ఈయన ఒక పర్యాయం నర్సాపురంవెళ్ళి, సత్యాగ్రహాన్ని నడుపుతున్న తాలూకా కాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శు

లనుగాని, రైతుసంఘ ముఖ్యులనుగాని, రైతులనుగాని విచారించక జమీందారీ పార్టీవారినిమాత్రం విచారించి గాంధీజీకి ఒక రిపోర్టుపంపాడు. ఆంధ్రసోషలిస్టులు వ్యక్తుల ఆస్తుల్ని దోచుకోటానికి ప్రోత్సహిస్తున్నారంటూ అందులోతెలియజేశాడు. పైపెచ్చు కాశీపట్నం జమీందారును గాంధీజీ వద్దకు తీసుకెళ్ళి, ఆయన కాంగ్రెసు జమీందారనీ, ఆయన భూముల్ని దౌర్జన్యంగా రైతులు లాక్కొనునట్లుగా కాంగ్రెసు వాదులే ప్రోత్సహిస్తున్నారనీ తెల్పాడు. తనశిష్యోత్తముని మాటలునమ్మి గాంధీజీ కూడా కాశీపట్నం రైతుల పోరాటాన్ని ఖండించాడు. ఈ తగాదా శాంతియుతంగా పరిష్కారం కాకపోతే రాజాజీ ప్రభుత్వమే దానిని పరిష్కరిస్తుందని బెదిరించారు. ఆం॥ కాం॥ వర్కింగుకమిటీ సమావేశమై కాశీపట్నం సత్యాగ్రహం "చెడు సలహాలపైననూ తొందరపాటుతోనూ" చేయబడిందన్నారు ఇంతేగాదు.

1. "ముందుగా రాష్ట్ర కాంగ్రెసు కమిటీయొక్క అనుమతిగాని, సలహాగాని, సంప్రదింపుగాని లేకుండా యిక ముందెప్పుడూ ఇట్టి అధికార రహితమైన సత్యాగ్రహాలు చేయకూడదని వార్నింగు యివ్వబడింది.

2. ఈ సత్యాగ్రహంలో పాల్గొన్న బాధ్యగల కాంగ్రెసువాదు లందరి వద్దనూ సంజాయిషీ తీసుకొనవలని రాష్ట్ర కార్యదర్శికి అధికారం యివ్వబడింది."

ఈ తాఖీదుకు కామేడ్స్ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, సుందరయ్యగార్లు పంపిన జవాబులలో ఈ క్రింది భాగాలు చాలా ముఖ్యమైనవి.

"మేము అఖిలభారత కాంగ్రెసు కమిటీలో బాధ్యతగల సభ్యులము. మాలో ఒకరు రాష్ట్ర రైతు సంఘాధ్యక్షుడుగనూ, రెండవ వ్యక్తి రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యదర్శిగనూ వున్నాము. ఈ ప్రధాన సమస్య కాంగ్రెసు వాదులలో చాలామంది (సోషలిస్టులందరితో సహా) యీ క్రింది విధంగా ఆలోచిస్తున్నారనీ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వర్కింగుకమిటీవారికి విశదపరుస్తున్నాము.

"రైతుల న్యాయమైన కోర్కెలను తీర్చడానికి కాంగ్రెసు కమిటీలు కాంగ్రెసు మంత్రులు పూనుకొనునట్లు ప్రయత్నిస్తాము. కాంగ్రెసు కమిటీలుగాని, కాంగ్రెసు మంత్రులుగాని ఈవిషయంలో జోక్యం కల్గించుకొనని పక్షాన రైతులు రైతు సంఘాలు చేయు ప్రత్యక్ష పోరాటాలను బలపరుస్తాము. వారి న్యాయమైన కోర్కెలకై జరిగే పోరాటాలకు సహాయం చేయడంవలననే రైతులు కాంగ్రెసు సంస్థలోనికి, స్వరాజ్య పోరాటంలోనికి వస్తారని మావంటి కాంగ్రెసువాదుల దృఢ విశ్వాసం....రైతు కూలీల ఆర్థిక రాజకీయ దాస్య విముక్తికొరకు పోరాటాలను సాగించగలశక్తి మన జాతీయ పోరాటానికి లాభకరం, కాంగ్రెసు సంస్థకుబలం అని మేము గట్టిగా నమ్ముతున్నాము.

"కాంగ్రెసు కమిటీలేవీ ధనవంతులయొక్క గాని భూస్వాములయొక్క గాని స్వాధీనంలో లేకుండా వున్నట్లయితే (మన దురదృష్టవశాత్తు నేటికీ అట్టి కమిటీలు చాలా వున్నాయి) కాంగ్రెసుకీ-రైతు, కార్మిక సంఘాలకూ మధ్య ఎట్టి స్పర్ధా వుండదు. స్పర్ధ ఏర్పడినట్లయితే దానికి సంబంధించిన అన్ని సంస్థలూ బలహీన పడుతాయి. ఇది జరగకుండా చేయాలని మా ఆశ. అందువల్లనే కార్మికులయొక్క గాని రైతులయొక్క గాని పోరాటాలకు కాంగ్రెసు కమిటీలు సహాయపడి బలపర్చాలని మేము కోరుతున్నాము. కాని కాంగ్రెసు నాయకులు మమ్ములను డిసిప్లెనరీ చర్యలతో బెదరించి నప్పటికీ, పోరాటాన్ని సాగించే రైతుల్ని గాని, కార్మికుల్నిగాని మేము విడిచిపెట్టజాలము. విడిచిపెట్టముకూడ. ఎందువల్లనంటే, రైతు కార్మికుల నిత్యపోరాటాలను విడిచిపెట్టటమంటే అర్థం కాంగ్రెసు సంస్థను బలహీనపర్చడం మాత్రమేగాక కాంగ్రెసును భారత స్వాతంత్రంకోసం పోరాడు సంస్థగాకూడా లేకుండా చేయడమని మాదృఢ విశ్వాసం...."

స్థానిక కాంగ్రెసుకమిటీలూ, కాంగ్రెసు ముఖ్యులూ రాష్ట్రమందలి యితర అన్ని ప్రజాసంస్థలూ బలపరచ్చుతున్నా కాశీపట్నంయెడ ప్రధాన కాంగ్రెసునాయకులిట్టి లజ్జాకరమైన పంథాను అవలంబించుటవల్లనే విచారణకమిటీలో కాశీపట్నం రైతులకు అన్యాయం జరిగింది. కాని ఈ అపజయంవల్ల రైతు ఉద్యమం దెబ్బ తినలేదుసరికదా మరింత అభివృద్ధి జెందినది. స్థానిక కాంగ్రెసు కమిటీలు కమ్యూనిస్టు ఆధ్వర్యాన ఈ పోరాటానికి పూర్తిగా సహాయం జేయుటవల్లనే నర్సాపురం తాలూకాలో కాంగ్రెసు నిజమైన ప్రజాసంస్థగాకూడా అభివృద్ధి జెందినది. ఎన్నడూ లేనట్లుగా ఒక్క నర్సాపురంతాలూకాలోనే 70 గ్రామ కాంగ్రెసు సంఘా లేర్పడ్డాయి. కమ్యూనిస్టుపార్టీ ప్రజాపార్టీగా ఈ తాలూకాలో ఏర్పడింది. యుద్ధకాలంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ఈ తాలూకాలో అధికాహారోత్పత్తికి చక్కటి కృషి జరిగింది. లింగనబోయినచర్ల గ్రామంలో రైతులు స్వయం సహాయంద్వారా తమ కాల్వను తామే తవ్వకొని బంజరుభూములను సాగులోనికి తెచ్చారు. పాలకొల్లు మున్నగుచోట్ల ఎరువులు, ఇనుము వ్యవసాయవస్తువుల అమ్మకంలో జరిగే దొంగవ్యాపారాన్ని పట్టుకొని రైతులకు కంట్రోలురేట్లకు అందజేయబడింది. ఈనాడు ప.గో. జిల్లా నర్సాపురంతాలూకా కాంగ్రెసు ఉద్యమంలోగాని, రైతు ఉద్యమంలోగాని, మహిళా ఉద్యమంలోగాని ప్రప్రధానస్థాన మాక్రమిస్తోన్నదంటే అందుకు కారణం కమ్యూనిస్టుపార్టీ గావించిన కృషియేనని ఎల్లరు అంగీకరించే విషయమే.

# మునగాల రైతు పోరాటచరిత్ర

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ నాయకత్వాన వివిధజిల్లాలలో రైతాంగం తమ హక్కుల సముపార్జన కొరకై అనేక పోరాటాలను సాగించ ప్రారంభమైనది. అన్ని పోరాటాలలోనూ కమ్యూనిస్టులు ముందు నిల్చుని వీటిని నడిపారు. కృష్ణాజిల్లాలో గంపలగూడెం. ముక్త్యాల, కొండపర్వ, చాట్రాయి, చల్లపల్లి మొదలగు ఎస్టేటులలో అనేక పోరాటాలు జరిగినవి. గుంటూరు జిల్లాలో అటవీ నిర్బంధాలకు వ్యతిరేకంగా తీవ్రమగు ఆందోళన జరిగింది. నెల్లూరుజిల్లాలో వెంకటగిరి ఎస్టేటు దురంతాలకు వ్యతిరేకంగా, తూ.గో.లో పిఠాపురం, కపిలేశ్వర పురం, తుని ఎస్టేటుల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాటాలు జరిగినవి. ఉత్తరవిశాఖలో మందాసా ఎస్టేటులో బ్రహ్మాండమగు పోరాటం జరగటం, రైతులు జమీందారీ రౌడీలను, పోలీసులను ఎదుర్కొనటం, లాఠీ చార్జీలు, తుపాకి కాల్పులు జరగటం ఆ పోరాటంలో ఒక పోలీసూ 3 గ్గురు రైతులూ చనిపోవటం, అనేక మంది రైతులు అరెస్టు కాబడి జైళ్ళకు పంపబడటం జరిగింది. ఇంతేకాదు: శిస్తు రెమిషన్ల కొరకు, ప్రాజెక్టు నిర్మాణంకొరకు నిర్మాణాత్మకమగు కృషి జరిగింది. లంచగొండి తనానికి వ్యతిరేకంగా తీవ్రమగు ఆందోళనజరగటంవల్ల తిరువూరు డిప్టీ రిజిస్ట్రారు అల్లూరు కరణం మొదలగువారిపై కేసులు నడిచాయి. వీటి యన్నిటినీ మించి రైతుల హక్కులకై జరిగిన బ్రహ్మాండమగు పోరాటం మునగాల ఎస్టేటులో జరిగినది.

## విషాదగాథ

మొగలు పాదుషా షాజహాను ఒక మందిరం—పై "స్వర్గమనేదివుంటే అది ఇదే, ఇదే, ఇదే" అని వ్రాయించాడట. అదేవిధంగా మునగాల ఎస్టేటు మొగలో "రైతుకు నరకమనేది వుంటే అది ఇదే, ఇదే, ఇదే" అని అదృశ్య రూపంలో వ్రాయబడి వుంటుంది.

కాట్రగడ్డ నారాయణరావుగారు తాను అసెంబ్లీ సభ్యుడుగా 1937 లో ఎన్నుకోబడ్డ పిమ్మట వియోజకవర్గంలో రైతాంగ స్థితిగతులను తెలుసుకొనుటకై మునగాల ఎస్టేటు వెళ్ళారు. ఆయన తిరిగి వచ్చినపిమ్మట చెప్పే విషయాలను నేను నమ్మలేకపోయాను. వాస్తవికపరిస్థితులను తెలుసుకొనుటకై జిల్లాకాంగ్రెసు

కమిటీ ఒక విచారణ సంఘాన్ని నియమించాలని, జిల్లాకాంగ్రెసు కమిటీలో సభ్యులముగావున్న కొద్దిమంది కమ్యూనిస్టులం కోరాము. ఒక విచారణసంఘం ఏర్పడింది. ఈ సంఘం మునగాలఎస్టేటు వెళ్ళింది. స్వయంగా అనేకగ్రామాలు తిరిగి బోలెడంతసమాచారాన్ని సేకరించింది. వీటినన్నిటినీ ఈ విచారణసంఘం పక్షాన సమగ్రమైన నివేదికగా తయారుచేసి జిల్లాకాంగ్రెసు కమిటీముందు విచారణ సంఘ సభ్యుడనైన నేను పెట్టాను. కొణకంచిలో జరిగిన కమిటీ సమావేశంలో ఈ నివేదికపై దీర్ఘమైన చర్చ జరిగింది. జిల్లా కాంగ్రెసు తమ బాధల నివృత్తి కొరకై కృషిజేస్తుందిగదా యనే తలంపుతో మునగాలనుంచి అనేకమంది రైతులు వచ్చి కమిటీసమావేశాన్ని వీక్షిస్తూ కూర్చు న్నారు. నివేదికలో ఎస్టేటుపరిస్థితులు, జమీందారీ దురంతాలుకళ్ళకు గట్టినట్లుగా వర్ణించబడ్డాయి. ఇవి నిజంకాదనటానికి ఎవరికీ సాహసం లేకపోయింది. కాని జమీందారు స్నేహితులు, పక్షపాతులూ ఈ కమిటీలో లేకపోలేదు. అయ్యదేవర కాళేశ్వరరావు మునగాల రాజాగార్ల శరీరాలు వేరేగాని ఇద్దరూ ఒకటే అన్నంత అప్తులు. కాళేశ్వరరావు, మరుపిళ్ళ చిట్టి, జొన్నవిత్తుల కుటుంబరావు వగైరాలు రిపోర్టును వ్యతిరేకించారు. రిపోర్టు కాపీని అందరికూ అందజేయకుండా ఒక పర్యాయం చదివినంతమాత్రాన చర్చిస్తానికి వీలులేదన్న కారణంచూపి తోసి వేస్తానికి ప్రయత్నించారు మునగాల రైతులగుండెలు దడదడా కొట్టుకొన ప్రారంభించాయి. ఎంతో ధైర్యంచేసి జమీందారుకు వ్యతిరేకంగా సాక్ష్యము లిచ్చాముగదా ? ఇప్పుడు కాంగ్రెసుకూడా మనలనుజారవిడుస్తే, ఇక జమీందారు మనలను బ్రతకనిస్తాడా యన్నది వారి గుండెదిగులు. కాని కాంగ్రెసు కమిటీ యందిలి తీవ్రవాదుల సహాయంతో నివేదిక ప్యాసయింది.

నివేదిక వెల్లడించిన విషయాలు ఏమిటి: కాళేశ్వరరావుగారు దాచాలని తలచిన విషయాలు ! మచ్చుకు ఈ నివేదికనుండి అక్కడక్కడా కొద్దిభాగాలు వుదాహరణలు చూడండి.

"ఎస్టేటువుద్యోగి గ్రామంలోకి వచ్చాడంటే మరాటీలదండు వచ్చినంతటి భయోత్పాతం ప్రజలలో కలుగుతుంది. గడియ (దివాణం) లోనికి రమ్మని కబురువచ్చిందంటే జుల్మానా పడ్డదనో, వీపు బ్రద్దలైందనో స్థిరపర్చుకొనే ఏమవిషియైనా బయలుదేరుతాడు"

"ఎస్టేటులో సరియైన సర్వే సెటిల్మెంటులు జరుగలేదు."

"పట్టాలలో వుదహరింపబడిన శిస్తుకన్న ఎక్కువగానే వసూలుచేయుట కూడా కలదు."

"ముఖ్యంగా రైతుసంఘములో జేరినందులకుగాను అపరాధంగా వందల కొలది ఎకరాలభూములను నిర్బంధంచేసి విడుదల పెట్టించినట్లున్నూ, రిజిష్టరీ చేయించుకొన్నట్లున్నూ, తాము విధిలేక భయంవల్ల అట్లుచేసితిమనియు అనేక మంది స్టేటుమెంట్లలో చెప్పినారు."

"శిరిపురంలో రాజవీధియని చెప్పబడే బజారు పూర్తిగా ఆక్రమింపబడి, చుట్టూ ఇటీవలనే గోడలు కట్టబడినవి."

"ఈనాందార్లు (ఈనాముదావాలగూర్చి) కోర్టులలో కంప్లెయింటు చేయలేదు. దీనికి కారణం జమీందారు తమ్ము మోసగించిన్ని, దౌర్జన్యం చేసిన్ని కంప్లెయింటు చేయకుండా ఆపివేసిరని చెప్పుచున్నారు.........జమీందారు మోసంజేసాడన్న ఈనాందారుల కంప్లెయింటులో సత్యం లేకపోలేదని స్ఫురిస్తున్నది."

"చాకళ్ళు, మంగళ్ళు, కుమ్మర్లు మున్నగు వారందరూ జమీందారునకు, ఎస్టేటు వుద్యోగస్థులకు నిర్బంధముగా వెట్టిచేయవలసివస్తున్నది.....పని చేయునపుడు బాలింతలను బిడ్డలకు పాలిచ్చుటకైనా ఇండ్లకు పోనీయరనీ, గోడలకు పాలు పిండుకోమనీ అంటారట."

"శిరిపురంలో కోటమ్మ యను వైశ్యస్త్రీ చనిపోగా....ఎస్టేటుమేనేజరు సాంబయ్యగార్ని తక్కిన మువ్వురను (వారసులను) పిలిపించి దొరికిన నవర్సులు మొదలగు వస్తువులను తెస్తున్నారు. రెండవరోజున వస్తువులను సాంబయ్యగారు తీసుకొనివెళ్ళి మేనేజరుకు వప్పగించారు. తర్వాత ఎస్టేటునౌకర్లు వచ్చి కోటమ్మ ఇంటిని ½ గజంలోతు తవ్వి మరికొంత సొమ్ము వస్తువులు దొరకగా పట్టుకువెళ్ళారు. పిమ్మట జమీందారు నడిగూడెం రాగానే సాంబయ్యగారు వెళ్ళి ఫిర్యాదుచేసుకోగా కర్మచేయుటకై 2 వులవబస్తాలిచ్చి తక్కిన చరాస్తిని వేలం వేయించాడు. సముద్దారు కొన్ని పశువులను తోలుకొనిపోయినాడు....శిరిపురంలో ఒకవీధిలో చాలాయిండ్లు పాడుబడివున్నవి. వీటన్నిటిని జమీందారు దౌర్జన్యంగా ఆక్రమించుకొని పాడుపెట్టాడని గ్రామస్థులు చెప్పారు.....శిరిపురంలో జిల్లాబోర్డు అంగీకారముపై గ్రామస్థులు పాఠశాలకుగాను స్థలమును సంపాదించి ఇల్లుకట్టుటకు ప్రారంభించారు....కాని 6–6–1933 న ఆ స్థలమును, కట్టబడుచున్న ఇంటిని జమీందారు ఆక్రమించుకొని, ఇంటిని పూర్తిగా కట్టించి స్వంతమునకై ఇప్పటికిని వుపయోగించుకొంటున్నాడు."

"రైతుసంఘ సభ్యులపై బహిష్కారము....వీరికి (రైతుసంఘసభ్యులకు) గ్రామంలో ఎవరూ పనిచేయకూడదు; అమ్మకూడదు। మాట్లాడకూడదు। వీరి ఇండ్లకు వెళ్ళకూడదు। తమ ఇండ్లకు రానీయకూడదు। ఇట్లు ఏవిధంగాను

సంబంధము పెట్టుకొనక బహిష్కరించాలి.....వీటి నుల్లంఘించినవారిని దెబ్బలు కొట్టుట,జరిమానాలు వేయుట ఇకముందు జాగ్రత్తగావుండుటకై ఖరారునామాలు, ప్రతిఫలశూన్యమగు ప్రోనోట్లు వ్రాయించుకొనుట మొదలగువిధాలసాధించారు"

"ఎస్టేటులో సాగుచున్న నిరంకుశ పరిపాలనకు వుదాహరణగా దెబ్బలు కొట్టుటనుగూర్చికూడా చాలామంది తెల్పినారు. కందుల రాములుగారనే రేపాల గ్రామస్థుని ఏదో తప్పుచేశాడని గదిలోనికి పిలిపించి చావగొట్టించినారట. దెబ్బలు భరించలేక పడిపోతూవుండగా గొంతులో నీళ్ళుపోసి నిల్చోబెట్టి మరల కొట్టినారట. చివరకు వానివద్ద రు 100 లు జరిమానా వసూలుచేసి వదలినారట"

"మా యీ విచారణఫలితంగా, ఎస్టేటు పరిపాలనలో అనేక అక్రమాలు జరుగుచున్నవనియు, జమీందారు తనకు లేని నిరంకుశాధికారాలను చలాయించుచు ప్రజలను పీడించుచున్నట్లును, ఎస్టేటు పరిపాలకవర్గమంతయూ అవినీతి పూరితమై ప్రజలను క్రుంగదీయుటకు మరింత తోడ్పడుచున్నదనియు మేము తలచుచున్నాము."

ఇవి రిపోర్టులోని కొన్ని మచ్చుతునకలు. ఈపరిపాలనను సాగించేవ్యక్తి మునగాలఎస్టేటుజమీందారు నాయని వెంకటరంగారావుగారు 1920 నుండే కాంగ్రెసువాది.

## రైతాంగశక్తి అజేయం

శాసనసభ్యుడు నారాయణరావుగారు వెళ్ళి వెట్టిని మానండని పిలుపునిచ్చి వచ్చారు. విచారణకమిటీవెళ్ళి రైతులను మేల్కొలిపింది. రైతుహక్కులను సాధించుటకై జమీందారీ దుర్నయాలను అరికట్టుటకై పోరాటాలు సాగించాలి. ఇందులకై జిల్లాకాంగ్రెసుకమిటీ బాధ్యత హెచ్చింది. కాబట్టి ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ సహాయంతో జిల్లాకాంగ్రెసు కమిటీ కొంతమంది వలంటీర్లను మునగాల ఎస్టేటుకు పంపి రైతువుద్యమాన్ని పెంపొందించ దలచింది. ప్రథమంలో కామ్రేడ్స్ చంద్ర రాజేశ్వరరావు. వెల్లంకి విశ్వేశ్వరరావు పంపబడ్డారు. పిమ్మట కామ్రేడ్స్ నండూరి ప్రసాదరావు. పరంధామయ్య. ఆంజనేయులు పంపబడ్డారు. అతివాదుల నాయకత్వాన వున్న జిల్లాకాంగ్రెసుకమిటీ, ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం తమ శక్తులన్నిటినీ కేంద్రీకరించి రైతు ఉద్యమాన్ని పెంపొందించినవి.

ఎస్టేటులో రైతులపక్షాన పనిచేయటం చులకనైన పనిగాదు. 19'0 లో రైతుసంఘాలు పెట్టినవారు జమీందారుయొక్క తీవ్రకోపాగ్నికి గురియైనారు. నాయకులుగా తల వెళ్ళబెట్టిన ప్రతివారి తలనూ చితకబొడిచాడు. కొంపలు,

పెంటపోగులతోసహా దోచుకున్నాడు. వారిని సాంఘికంగా బహిష్కారం చేయించాడు. చివరకు మంచినీళ్ళు త్రాగుటకుకూడా వీలులేకుండా ఒకకరణం దొడ్లోవున్న మంచినీటిబావిలో అశుద్ధం కల్పించాడు. "జమీందారు కోర్కెలకు భిన్నంగా నడిస్తే ఎస్టేటులో బ్రతుకుట దుర్లభం అన్న గ్రామమున్నుడు మొరలో సత్యం ధ్వనించుచున్నది." అని. రైతుసంఘంలో జేరిన కొల్లు అచ్చయ్యగారిని జమీందారు కొట్టించిన సందర్భంలో సబ్‌కలెక్టరు జడ్జిమెంటులో వ్రాశాడు. ఇట్టి దురాగతాలనుసహితం అనుభవింపవలసివస్తుందని వలంటీర్లకు ముందే తెలుసును. అయినా భయపడలేదు. ప్రజాసేవలో. రైతు వుద్యమంలో ప్రాణాలను సహితం అర్పిస్తానికి సిద్ధమయ్యే ఈ రైతు యువకులు ఆ ఎస్టేటు వెళ్ళారు.

కాంగ్రెసు, తాను సాగించిన సత్యాగ్రహోద్యమాలను ఉపసంహరించి నప్పుడల్లా "ప్రజలు ధైర్య హీనులయ్యారు. అందుచే ఉద్యమాన్ని ఉపసంహరించవలసి వచ్చింది." అని తప్పును ప్రజలనెత్తిపైకుద్దటం పరిపాటి అయింది. కాని ఇది నిజంకాదు. తమ రాజీధోరణిని. ప్రజాచైతన్యంయెడ తమకుగల భయాన్ని కప్పిపుచ్చుకుంటానికే కాంగ్రెసునాయకులు ఇట్టి సాకులు వెదుకుతూ వుంటారు. మునగాలలోచూడండి. 1930 లో ప్రకాశం పంతులు, విశ్వనాధ దాసు మహాశయోగార్లు వెళ్ళి రైతులను కదల్చివచ్చారు. తర్వాత శాసనోల్లంఘనంలో తాము జైళ్ళకు వెళ్ళారు. ప్రజలు ధైర్యయుక్తంగా జమీందారుతో పోట్లాడారు. కాని జాతీయోద్యమ సహాయంలేక, నాయకత్వంలేక ప్రభుత్వం జమీందారు కలిసి చేసిన దాడి ఫలితంగా తాత్కాలికంగా లొంగిపోయారు. పైన పేర్కొన్న దుర్ణయాలన్నీ 1930 తర్వాత జరిగినవే. అయినా, ఇంత దారుణ హింసాకాండ జరిగినా, రైతాంగంలో అగ్ని చల్లారలేదు. నివురుగప్పి మాత్రం వుంది. అందుచేతనే, 1938 లో తిరిగి రైతుసంఘాన్ని నిర్మిస్తానికై ప్రయత్నాలు జరుగగానే ఎస్టేటులోని 40 గ్రామాల రైతులూ అమితోత్సాహంతో ముందుకు వచ్చారు. ప్రధమ సంవత్సరంలోనే 20,000 జనాభాలోనూ 3000 కు పైగా కాంగ్రెసు సభ్యులుగానూ 4 000 కు పైగా రైతుసంఘ సభ్యులుగానూ జేరారు. తమ హక్కులకొరకై పోరాడనిల్చారు. ఈదఫా 'యశోవా, మృత్యుర్వా'. వేరుమార్గంలేదు.

## రైతు పోరాటాలకు నాంది

మునగాల జమీన్ రైతు సంఘ నాయకత్వాన ప్రజలు జమీందారీ దురంతాల నెదుర్కొనుటకు తయారైనారు. మొట్టమొదటగా, ప్రజలందరినీ వేధిస్తూ

న్నది వెట్టిచాకిరి. ఇక దీనిని ఎవరూ జమీందారుకు పోలీసులకూ చేయకూడ దనుకున్నారు. అక్రమ శిస్తులు చెల్లించ నిరాకరించారు. చెట్లపైవుండే తమ హక్కులను చలాయించుకో సాగారు. తమలోవచ్చే గిల్లికజ్జా లన్నిటినీ జమీం దారుముందుపెట్టి, మహాప్రభూ విచారించండి, అనటం మానుకున్నారు. జమీం దారు బలవంతంపై కొందరిపై జరిపే సాంఘికబహిష్కారాన్ని మానుకొని, ప్రజలను పీడించుకుతింటూ, వారి కోర్కెలను మన్నించని షాహుంకార్లు, జమీం దారీ వుద్యోగులు, పోలీసు, రౌడీలపైన ప్రయోగించ సాగారు. తమ హక్కు లన్నీ గుర్తింపబడే వరకూ శిస్తులను చెల్లించటం నిరాకరించా లనుకున్నారు. రు 1,20,000 చెల్లవలసిన శిస్తులో ఒక్క దమ్మిడీకూడా చెల్లింపబడలేదు జప్తులు జరుగుతే నిరోధించదలచారు. దీనితో కధ అడ్డం తిరిగిం ి.

ప్రతి చెరువుక్రిందా జమీందారుకు పాతికో, పరకో ఎకరాల స్వంత కమతంభూమి వుండేది. లోగడ దీనిని దున్నటం, ఊడ్చటం, కోయటం, నూర్చటం అన్నీ రైతులూ, కూలీలే వెట్టికి చేసేవారు. కాని ఇప్పుడా పప్పులు ఉడకవు. రైతులతో పాటు తానూ కూలీ యిచ్చి చేయించుకోవలసిన అగత్యం పట్టింది. ఎల్లకాలం తన ఆటలు సాగుతాయా మరి!

కలకోవ గ్రామంలో జమీందారు భూమి వుంది. అది పండి కోతకు సిద్ధ మైంది. రైతులు మామూలుగా యిచ్చే కూలిని తామూ యిస్తామని ఎస్టేటువారు కోత గోయించారు. 72 రు హరిజన స్త్రీలు కష్టపడి 22 ఎ॥లు కోత గోసారు. తీరా కోతగోసి, 3 మైళ్ళు నడిచి, ఎస్టేటు దివాణానికి వెళ్ళి తమ కూలిని అడు గుతే, కొట్టు అడుగువ ముక్కిపోయినవడ్లు ఎ 1 కి 3 కుండల చొప్పున యిస్తా మన్నారు. రైతు లిచ్చేది 4 కుండలైతే 3 కుండలు తీసుకోమన్నారు కూలీలు! మేము ఎక్కువ యిచ్చేదిలేదు, పొమ్మన్నారు ఎస్టేటువారు. మీ రివ్వకపోతే మా సంఘమే యిప్పిస్తుందని కూలీలు వచ్చేసారు.

ఈ కూలీలకు న్యాయంగా రావలసిన కూలిగింజలకొరకై రైతుసంఘం నాయకత్వాన పోరాటం ప్రారంభమైంది. హరిజన కూలీలు, వీరికి తోడుగా కొంతమంది రైతులూ కోటగుమ్మంముందు సత్యాగ్రహంచేయ ప్రారంభించారు. దీనితో ఎస్టేటు అంతటా అగ్ని ప్రజ్వరిల్లింది. ప్రజలలో విపరీతమగు పట్టుదల కల్గింది. జమీందారు కూలీలకుచేసిన అన్యాయాన్ని ప్రతిఘటించుటకై రైతాంగం నడుము కట్టింది, సత్యాగ్రహులకు తోడుగా మొదటిరోజున 500 మంది, రెండవ రోజున 1000 మంది 3 వ రోజున 3000 మంది రైతులు కోటవద్దకు వచ్చి సత్యాగ్రహులకు బాసటగా నిల్చారు.

ఎస్టేటుదారు దీనిని, తన మామూలు ధోరణిలో అణచ ప్రయత్నించాడు. ఎస్టేటు అంతటా దుర్వదంతులను వ్యాపింపజేసారు. కొంపలు తగల బెట్తారట! ప్రసాదరావు, పరంధామయ్య వగైరాలను ఖూనీ చేస్తారట! కోటముందు వీరు మీటింగు ప్రయత్నంలో వుండగా, పట్టపగలు 10, 12 మంది ఎస్టేటు రౌడీలు కట్టలతో ప్రదర్శనాలు జరిపారు. కాంగ్రెసు తమతో రాజీపడిందనీ, ప్రభుత్వం ఇంక వాలంటీర్లను అరెస్టుచేస్తుందనీ పుకార్లు పుట్టించారు. అయినా ప్రయోజనం లేకపోయింది. ఉద్యమం మరింత తీవ్రము కాజొచ్చింది చివరకు, పోలీసు సహాయాన్ని అర్థించడం తన ధాన్యం కుప్పలనూ, కోటనూ దోచుకొనుటకై రైతు సంఘం ప్రయత్నిస్తున్నదను తప్పుడు టెలిగ్రాములు పంపించాడు. దీనితో 24-12-38 తెల్లవారు సరికి జిల్లా కలెక్టరు, జిల్లా పోలీసు సూపర్నెంటు, సబ్ కలెక్టరు వగైరాలు, 3 లారీల పోలీసులతో మునగాలలో దిగారు.

పోలీసులే కాదందోయ్ వచ్చింది. చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శి అయ్యదేవర కాళేశ్వరరావుగారు, ఇంకొక కార్యదర్శి బి. యస్. మూర్తిగారు కూడా ఈ రిజర్వు పోలీసులతో కలిసివచ్చారు. అహా, హరిజన నాయకులు, కాంగెసు నాయకులు వచ్చారుగదా, హరిజన కూలీలకు న్యాయం కల్గుతుందిగదా యని ఆశించారు ప్రజలు. కాని అంత పుణ్యమా! ఎక్కడెక్కడనో వున్న వలంటీర్లను వెతికి, మునగాలకు తెప్పించిన మీదట. కాళేశ్వరరావుగారు జమీందారు పక్షన వకాల్తా పుచ్చుకొనకుండానే వాదించసాగారు. ఇంతటితో వూరుకుంటే పోనుగా: ఎంతైనా కాళేశ్వరరావుగారు ప్లీడరుగదా అని ప్రజలు వూరుకునేవారుగా. అట్లా వూరుకోలేదు. తమ కాంగ్రెసు నాయకత్వాన్ని. ఛీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ షిప్పును చూపించాలనుకున్నారు. మునగాల రైతుల వ్యవహారంలో కాంగ్రెసు జోక్యం కల్గించుకోదని జిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షులు తమతో చెప్పారనీ, ఎఱ్ఱజండా తమది కాదనీ, సోషలిస్టులదనీ, దీనిని తీసివేయాలనీ, కాంగ్రెసు ప్రచారకులగు అంజనేయులు, పరంధామయ్యగార్లు ఎస్టేటులోవున్నచో రాజీ కుదరదనీ, రాజీ కుదరప పక్షన ఆ ఎస్టేటులోవున్న ప్రజలు తమవారు కారని చెప్పెదమనీ, కాంగ్రెసు ప్రజలనే వుద్దేశంతో కాంగ్రెసు ప్రభుత్వానికి లోబడివున్న కలెక్టరు, సూపర్నెంటు ఇంతవరకూ వూరకున్నారనీ, కాంగ్రెసు మనుష్యులు కాదని తెలిసిన పిమ్మట పోలీసులు కాల్పులు కాల్చెదరనీ, అరెస్టులు చేసెదరనీ, ఈ హంగామా జరగకుండా రాజీపడుట మంచిదనీ, ఏమేమో హెచ్చరించారు. కాని పాపం, రైతులదీక్ష, త్యాగం, వీరత్వమహిమ వారేమి ఎరుగుదురు!

(3)

కలెక్టరు సత్యాగ్రహానికిగల కారణాలను విచారించారు. జమీందారు అన్యాయం తేలిపోయింది. రైతుకూలీలకు ఎ 1 కి 4 కుంచల చొప్పున ధాన్యం కూలీ, మంచినడ్లు, కలకోవ గ్రామములోనే యిప్పించుటకు కలెక్టరు నిర్ణయించాడు. ఆ రాత్రియే కాశేశ్వరరావు, బి. యస్. మూర్తిగార్లతోసహా రిజర్వు పోలీసులందరూ బెజవాడ తిరిగి వెళ్ళిపోయారు.

రైతుసంఘమంటే రైతులకు, కూలీలకు యెట్టి అభిమానమో ఒక్క ఉదాహరణవల్ల తెలుసుకోవచ్చును సబ్ కలెక్టరు తాను ఒక్కడూ కలకోవవెళ్ళి కూలీలను పిలచి, 4 కుంచల చొప్పున కూలి తీసుకోండి యిప్పిస్తాను అని ఆజ్ఞాపించారు. హరిజనస్త్రీలు, చదువుసంధ్య లెరుగరు. ఎర్రటోపీనిచూస్తే పిట్టల్లాగు ఎగిరిపోయేవారు. ఈ రోజు సబ్ కలెక్టరుముందు ధీమాగా నిలబడి "మా రైతుసంఘ నాయకులువచ్చి చెప్పుతేనేగాని మేము ఒక్కగింజనైనా తీసుకోము" అని జవాబిచ్చారు. ఎందు బొమికలలోగూడ రైతుసంఘం ఎట్టి ఆత్మవిశ్వాసాన్ని రగుల్గొల్పింది.

## రాజీ - పొయ్యిరాజటమే

జిల్లాకాంగ్రెసు సంఘనివేదిక జమీందారీ దురంతాలను ప్రపంచానికి వెల్లడి చేసింది. ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం, జిల్లా రైతుసంఘం మునగాల ప్రజలకు అండగా నిల్చాయి. కలకోవ పోరాటంలో రైతాంగానికి ఎక్కడలేని ధైర్యమూ, ఉత్సాహమూ వచ్చాయి. ఈ ప్రజా శక్తిముందు ప్రభుత్వమూ, జమీందారూ లొంగిరాక తప్పిందికాదు. రాజీ సంభాషణలు ప్రారంభించారు. చివరకు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుసంఘ ప్రధాన కార్యదర్శి గొట్టిపాటి బ్రహ్మయ్యగారి మధ్యవర్తిత్వాన రాజీ చేసుకొనుటకు రైతుసంఘమూ, జమీందారూ అంగీకరించారు. చివరకు 11-1-39 న రాజీ పత్రంపై రైతుసంఘ నాయకుల, కుమారరాజా సంతకాలు జరిగాయి.

కాని బ్రహ్మయ్యగారు జీవితాంతం సిగ్గుపడవలసిన విషయం ఇక్కడ జరిగింది. జిల్లాకాంగ్రెసు సంఘముచే పంపబడి, అష్టకష్టాలకూ, జమీందారీ దుండగాలకూ తట్టుకుంటూ రైతు ఉద్యమాన్ని నిర్మిస్తున్న వాలంటీర్లు కామ్రేడ్స్ పరంధామయ్య ఆంజనేయులను ఎస్టేటునుంచి వెళ్ళిపొమ్మని రాష్ట్రకాంగ్రెసు పక్షాన బహిష్కరణపు టుత్తరువును జారీచేసారు. వీరు రైతులను రెచ్చగొట్టుతున్నారట। దౌర్జన్యాన్ని ప్రబోధిస్తున్నారట। కాంగ్రెసు జండాకు పోటీగా ఎర్ర జండాను పెట్టుతున్నారట। ఈభోగట్టా అంతా వీరికి పోలీసుల ద్వారానూ, లింగ

గిరి జమీందార్ల ద్వారానూ తెలిసినదట. ఆహా! చావుకు కూడా తెగించి రైతు సేవజేయ సమకట్టిన కాంగ్రెసు వలంటీర్లకు రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి బ్రహ్మయ్యగారు ఇచ్చిన బహుమతి ఇదీ!

దీనికి కారణం లేకపోలేదు. ఆనాడు కాంగ్రెసులో అతివాదులకూ, మితవాదులకూ తీవ్రసంఘర్షణ జరుగుతూవుంది. అతివాదుల నణచాలనే వుద్దేశంతో డాక్టరు పట్టాభి, బ్రహ్మయ్యగార్లు అనేక దురంతాలు చేశారు. పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసులో మెజార్టీలోవున్న అతివాదులను తొలగించాలనే వుద్దేశంతో వారు జేర్పించిన 35,000 సభ్యత్వాన్ని రద్దుచేసారు. ఇందులో, మునగాలలో జేరిన 3000 సభ్యత్వంకూడా రద్దు అయింది. దీనిపై ఎస్టేటులో తీవ్రసంచలనం కల్గింది. ఇదంతా కమ్యూనిష్టులే చేస్తున్నారు కాబట్టి వీరిని ఎస్టేటునుండి వెళ్ళగొట్టాలని బ్రహ్మయ్యగారు తలచారు.

మరొక కారణంకూడా వుంది. రాజీ అమలు జరిగిందేగాని, జమీందారును ఎరిగివున్న ఎవ్వరూ అది సత్యంగా అమలు జరుగుతుంది అనుకోలేదు. దానిని అమలు జరపాలంటే రైతుసంఘం బలంగా వుండాలి. ఆ హక్కులను నిలబెట్టుకుంటానికై పోరాటాలను సాగించ తయ్యారుగావాలి. కాని బ్రహ్మయ్యగారిదీ పంధాకాదు. చల్లపల్లి జమీందారు స్నేహితులైన వీరు మునగాల జమీందారుతో పోరాటానికి వప్పుకుంటారా! జమీందారును మంచిజేసుకొని, వారిచే ఏదో విధంగా, రాజీని అమలు జరిపించా మనవచ్చు. జమీందారును మంచిచేసుకుంటానికి, రైతు వుద్యమంలో వీరులుగానిల్చిన వాలంటీర్లను పంపివేయటం ఒక మార్గం. ఎంతచక్కటి ఆలోచన!

ఈ రాజీ జమీన్ రైతుసంఘానికి ఒక పెద్దవిజయం. వీరు కోరినవన్నీ దాదాపుగా అంగీకరించబడ్డవి. జమీందారు దౌర్జన్యంగా లాక్కున్న భూములు, వ్రాయించుకున్న బినామీ ప్రోనోట్లు యిచ్చివేస్తానికి అంగీకరించాడు. చెట్లపై రైతుల హక్కులను గుర్తించాడు. భూములను సర్వే జేయించటానికీ, పట్టాలను సరిగా మారుస్తానికి, వెట్టిచాకిరిని మానుకుని నౌకర్లను పెట్టుకుంటానికీ, ఆక్రమణలను వదలివేస్తానికి, అక్రమశిస్తులను వసూలు చేయకుండా వుంటానికి ఈనాములన్నిటికీ పట్టాలివ్వటానికీ, జమీందారు అంగీకరించాడు. రైతులు శిస్తులు చెల్లించివేయటకూ, సాంఘిక బహిష్కారాన్ని ఉపసంహరించుటకూ అంగీకరించారు.

రాజీ జరిగిందేకాని ఇది అమలుజరగటం ఎట్లా? మధ్యవర్తి బ్రహ్మయ్యగారు తన వకాల్తా యిచ్చి ఎర్నేని సుబ్రహ్మణ్యంగార్ని పంపారు. ఈయనవచ్చింది

## ఆంధ్రలో రైతు ఉద్యమం

మొదలు జమీందారుకు హృదయపరివర్తన కల్గించుటకై పరిశోధనలు సాగించాడు. ఇక రాజీ అమలు జరగటం సాధ్యమా? సంతకాలు జరిగిన మరునాటి నుండీ పేచీలు. కాలికితీస్తే వేలికి, వేలికితీస్తే కాలికిగా మడతపేచీలుపెట్ట ప్రారంభించాడు జమీందారు. రైతులు శిస్తులుకడితేనేగాని తాను ఏమీ మాట్లాడనన్నాడు. చివరకు శిస్తు రిమిషన్ల విషయంలో తగాదా వచ్చింది. మొదట్లో రు 1కి 0-4-0 రెమిషన్ యిస్తానని తర్వాత 0-2-0 అన్నాడు. బ్రహ్మయ్యగారు 0-4-0 ఇవ్వాలన్నారు. జమీందారు ససేమిరా, విననన్నాడు. జమీందారులో హృదయ పరివర్తనం కల్గకపోతే నేనెందుకిక్కడ అని సుబ్రహ్మణ్యంగారు బందరుకు నడిచారు. ఆఖరి ప్రయత్నంగా కామ్రేడ్ ప్రసాదరావు మరొక పరిష్కార మార్గాన్ని సూచించాడు. 0-4-0 రెమిషన్లూ మినహాయించి రైతులు శిస్తులను ముందుగా కడుతారు. తర్వాత జమీందారు తాను చేయవలసినవి చేయవచ్చునన్నాడు. కాని దీనికీ జమీందారు అంగీకరించలేదు. రాజీతో ఇక తాము సంబంధ ముంచుకోమని బ్రహ్మయ్యగారు చేతులు కడుక్కున్నారు. రాజీషరతుల నమలుబర్చిస్తానికై రైతులకిక పోరాటంతప్ప వేరుమార్గం గోచరించలేదు.

## మరల పోరాటం

ఆంధ్రరైతు ఉద్యమంలో మునగాలరైతుపోరాటం ఒక చరిత్రాత్మకఘట్టం. ఎప్పుడైతే రాజీ భగ్నమైందని తేలిపోయిందో ప్రజలు ఇక పోరాటానికి సంసిద్ధులు కాజొచ్చారు. జమీన్ రైతుసంఘం సమావేశమై సత్యాగ్రహం జరుప తీర్మానించింది. కామ్రేడ్ ప్రసాదరావు అధ్యక్షతక్రింద సత్యాగ్రహ కమిటీ ఏర్పడింది. జిల్లా రైతుసంఘమూ, కమ్యూనిస్టుపార్టీ (అప్పటిలో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ) ఈ సత్యాగ్రహమును బలపర్చ నిశ్చయించినవి.

జమీన్ రైతుసంఘం ప్రజలకు పిలుపు ఇచ్చింది. ఏ వృత్తివారైనాసరే జమీందారుకుగాని, దుర్మార్గులగు ఎస్టేటువుద్యోగులకుగాని నౌకరిచేయక, పూర్తిగా సాంఘికంగా బహిష్కరించాలి. వెంటనే చాకలి, మంగలి, కుమ్మరి, మాదుగ వగైరా వృత్తులవారందరూ పనులు మానుకున్నారు. ఎస్టేటులో ఎక్కడా ఒక్క చాకలికూడా ఎస్టేటువారి బట్టలు వుతికిన పాపానపోలేదు. ఆఖరుకు జమీందారు కోటలో నౌకరిచేయుటకుకూడా కూలీలు కరువైనారు. విధిలేక, నైజాంనుండి కొంతమంది చాకళ్ళను తెప్పించుకోవలసి వచ్చింది. కాని ఎస్టేటు ప్రజల తీవ్ర కోపాగ్నికి ఆగలేక వీరు వచ్చిన నాలుగురోజులలోనే తమ గ్రామాలకు జేరవలసి వచ్చింది. ఈ సాంఘిక బహిష్కారం ఎంతతీవ్రంగా నడచినదంటే,

గొడ్ల కాపలా కాసే పిల్లలు సహితం ఎస్టేటు ఉద్యోగుల పశువులను కాపలా కాస్తానికి నిరాకరించారు.

జమీన్దారీ రైతుసంఘం శిస్తులను నిరాకరించమనీ, జప్తులను విరోధించమనీ మరొక పిలుపు నిచ్చింది. వెంటనే ఏగ్రామంలో నూ ఒక్క దమ్మిడీ శిస్తు చెల్లింపబడలేదు. ఎస్టేటువారు జబర్దస్తీగా జప్తులు చేద్దామని బయలుదేరారు. ఒకటి రెండు చోట్లకన్న ఎక్కువ జప్తులుచేయలేక పోయారు. తర్వాత మరొక ప్రాంతానికి మేనేజరు బయలుదేరాడు. కాని తీరాబండి ఎక్కబోవు సరికి తాను వెళ్ళవలసినది రేపాలగ్రామం అని గుర్తుకు తెచ్చుకున్నాడు. గుండెలు జారి పోయాయి. ప్రయాణాన్ని నిలుపుకొని జప్తులుచేయుటకై పోలీసుల సహాయాన్ని కోరాడు. ఈ విధంగా జమీందారీ ఉద్యోగుల గుండెహడలగా శిస్తుల నిరాకరణోద్యమం సాగింది.



కామ్రేడ్ నండూరి ప్రసాదరావు

ఈ లోగా ఎస్టేటు అంతటా సత్యాగ్రహ దళాలు ఏర్పడ్డాయి. ఒక్క నెలరోజులలో 4 క్యాంపులలో 1100 మంది సత్యాగ్రహులు తర్ఫీదు అయ్యారు. కామ్రేడ్స్ ప్రసాదరావు పరంధామయ్య జోస్యభట్ల సత్యనారాయణలు రాజకీయాలు, కవాతు, సత్యాగ్రహ ధర్మాలు మున్నగునవి ఈ క్యాంపులలో నేర్పారు. ఎస్టేటులో దాదాపు ప్రతి ఇంటినుండి ఒక్కొక్కరు చొ॥ సత్యాగ్రహంచేయుటకు పంపబడ్డారు.

బ్రాహ్మణులు, వైశ్యులు, కమ్మవారు, రెడ్లు, చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి, మాదుగ మొదలగు అన్నికులములవారూ ఐక్యతతో సత్యాగ్రహులుగా జేరారు. ఇట్టి ఐక్య పోరాటము ఆంధ్రరైతు వుద్యమ చరిత్రలో అపూర్వము.

ఈ కాలంలో ఎవరి ప్రయత్నాలలో వారు వున్నారు. ప్రభుత్వం తన పోలీసుబందోబస్తు తానుచేసుకుంటున్నది. జమీందారు తనతప్పులను కప్పి పుచ్చు కుంటానికై రికార్డును పోగు జేసుకొంటున్నాడు. మద్యవర్తి బ్రహ్మయ్యగారు "చేతులు కడుక్కు కూర్చున్నాడు. బ్రహ్మయ్యగారి ఏజంటు సుబ్రహ్మణ్యంగారు జమీందారు రాజీపి అమలు జర్పనిచో, కోటముందు ప్రాయోపవేశాన్ని చేస్తాను." అన్న పెద్దమనిషి తన ఆశ్రమానికిపోయి కూర్చున్నాడు. జమీన్‌రైతుసంఘం జూన్ 2వ తేదీనుండి సత్యాగ్రహమునుసాగించుటకు ప్రభుత్వమునకూ, కాంగ్రెసు మంత్రివర్గమునకూ, రాష్ట్ర కాంగ్రెసుకూ, బ్రహ్మయ్యగారికీ నోటీసు యిచ్చింది.

ఇమ్మడి పాపయ్యగారు 1930 లో ఏర్పడ్డ జమీన్ రైతుసంఘానికి అధ్యక్షులు. అపాపానికై జమీందారు ఆయనను అనేక బాధలపాల్జేసి, చివరకు మోట భావితో వున్న ఆయన 5 ఎ॥ల మాగాణి భూమిని 18 ఎ॥ ల మెట్టభూమిని లాక్కున్నాడు. తిరిగి ఆ భూమిని స్వాధీనము చేసుకొనటకై రైతులు నిశ్చయించారు. అదేవిధంగా రామాపురంలో జమీందారు ఆక్రమించుకొన్న స్కూలు బిల్డింగును తిరిగి స్వాధీనము జేసుకొనుటకుకూడా నిశ్చయించారు. స్కూలు బిల్డింగును స్వాధీనం జేసుకొని అందుపై ఎఱ్ఱజెండాను, కాంగ్రెసు జండాను ప్రతిష్టించారు. అటు పిమ్మట ప్రభుత్వం 144 సెక్షన్ యిచ్చి ప్రసాదరావు వగైరా 30 మందిపై కేసు పెట్టింది.

1939 జూన్ 2 వ తేదీన పాపయ్యగారి పొలంలో సత్యాగ్రహం ప్రారంభమైంది. జమీన్‌రైతు ఉపాధ్యక్షులగు కామ్రేడ్ ఉప్పల రామయ్యగారి నాయకత్వాన ఎనమండుగురు రైతులు అరకలు కట్టుకొని భూమిలో ప్రవేశించి దున్నటం ప్రారంభించారు. వెంటనే వారిని పోలీసులుఅరెస్టుచేసారు. ఇకప్రారంభమైంది సత్యాగ్రహం. రోజు తరబడి రోజు ఒక్కొక్కదళంరావటం భూమిలోనికి అరకలతోప్రవేశించటం, అరెస్టుకావటం జరిగింది. కేవలం అరెస్టులతోనేపోలేదు. 4 వ తేదీన దారుణమైన లాఠీచార్జిజరిగింది. లాఠీకఱ్ఱలు విరిగినవి. రైతులకు బలమైనగాయాలు తగిలినవి. ఒక రైతు చేతివేలు పూర్తిగా ఎగిరిపోయింది. స్త్రీలపై సహితం అత్యాచారం జరిగింది. అయినా రైతులుతమ ధైర్యాన్ని విడనాడలేదు. జమీందారీ గూండాలను, పోలీసులను ఎదుర్కొని పోరాడసాగారు.

ఈ పోటంలో ఒక్క పురుషులేగాదు పాల్గొన్నది. స్త్రీలు, బాలురు సహితంగా అత్యుత్సాహంతో, ధైర్యంతో ముందుకువచ్చి పాల్గొన్నారు. ఊరూరా బాలసంఘాలు ఏర్పడ్డాయి. తమ పాఠాలను సమిష్టిగా చదువుకొనుటతో బాటు రైతుగీతాలను నేర్చుకొనుట, వాటిని పాడుతూ గ్రామవీధులలో వూరేగుట, గ్రామాలలో ఎక్కడ ఏ మూల జమీందారీమనుష్యులు, పోలీసులు ఏమి చేస్తున్నారో వార్తలు అందించుట, సంఘనిధిని వసూలుచేయుట ఈ బాలసంఘాల కృషి. 8,10 ఏండ్లబాలురు జమీందారీవిధానం నశించుగాక, పోలీసుల దౌర్జన్యాలు నశించుగాక" యని నినాదాలిస్తూ వీధులవెంబడి వూరేగుతూవుంటే పోలీసుల కడుపు మండింది. ఒక రోజున రాత్రివేళ ఊరేగింపు పోలీసుస్టేషను ముందుగా వెళ్ళుతోవుంటే రాళ్లు విసరి పెట్రోమాక్సు లైటును బద్దలుకొట్టటం, కుర్రవాళ్ళను గాయపర్చటం చేసారు. అయినా చెదరక, మరింత ఉత్సాహంతో నినాదాలతో బాలురంతా వూరేగటం సాగించారు.

మునగాల పోరాటంలో స్త్రీలు చూపిన ధైర్యసాహసాలు వర్ణనాతీతము. కామ్రేడ్స్ ప్రసాదరావు వగయిరా నాయకులను అరెస్టుచేసి కార్లపై తీసుకు పోతున్నారని గ్రామాలలో వార్తతెలిసింది. వెంటనే మునగాల, నారాయణగూడెం, బరాఖతగూడెం, రామాపురం మొ॥ గ్రామాలస్త్రీలు బాలురు 300 మంది రోడ్డుపై కాచివున్నారు. రిజర్వుపోలీసు బస్సువచ్చింది. దానిని స్త్రీలు ఆపేసారు. బాలురు రైతుగీతాలుపాడుతూ వుత్సాహపరుస్తూ వుండగా స్త్రీలు "నాయకులను వదలనిదే కారునుపోనియం"అని రోడ్డుకడ్డంగా నిల్చారు. పోలీసుల ఎంతబ్రతిమిలాడినా, బెదరించనా వినలేదు. చివరకు కామ్రేడ్సు పురుషులు సత్యాగ్రహంచేసి జైళ్ళకుపోగా స్త్రీలు గృహకృత్యాలను నిర్వహిస్తూ, జమీందారీ దౌర్జన్యాలను ఎదుర్కొండి, అని ఆదేశించినమీదట వారు కారుపోవుటకు దారిఇచ్చారు.

ముఖ్యులగువారు అరెస్టు అయ్యారుగదా. ఇక మన జప్తులు సాగించవచ్చుననుకున్నారు జమీందారీ పార్టీవారు. పోలీసుల సహాయంతో ఇండ్లలో జొరబడి, కనపడ్డ సామానునల్లా జప్తుచేయ నారంభించారు. కాని ప్రారంభించినదిమొదలు వీరికి మొట్టికాయలే తగల సాగాయి. ఉప్పల రామయ్యగారు మొదటిజట్టు నాయకుడుగా అరెస్టు అయ్యారు. ఇకనేం, వారి ఆస్తి జప్తు చేయవచ్చునని పోలీసుల సహాయంతో ఇంటిలో జొరబడ్డారు. వెంటనే కామ్రేడ్ రామయ్య సోదరి రుక్మిణమ్మగారు, మరొక కుమ్మరి స్త్రీ చీపురునూ, తెడ్డునూ పుచ్చుకొని ఎదిరించారు. పోలీసులూ, ఎస్టేటువారూ తోకముడిచారు. తాడువాయి పెళ్ళి గోనెని రామిరెడ్డిగారి యింట్లోదూరి జప్తుచేశారు. వెంటనే రామిరెడ్డి తల్లి

80 యేండ్ల ముదుసలి వచ్చి అడ్డుపడింది. తన ప్రాణ మున్నంతవరకూ ఆ జొన్నల బస్తాలను పోనీయనన్నది. పోలీసులూ, ఎస్టేటువారూ వట్టిచేతులతో బైటపడ్డారు. ఇక రామాపురం వెళ్ళారు. మందు వేసంగి నాలుక పిడచగట్టుకు పోతోంది. మంచినీళ్లు తాగుదామని రిజర్వు పోలీసులు దిగుడు బావిదగ్గరకు వెళ్ళారు. వెంటనే స్త్రీలు ఎదుర్కొన్నారు. నీళ్లు త్రాగుటకై చెంబు లివ్వానికి నిరాకరించారు. మా ప్రాణాలను బలిగొంటున్నవారు సిగ్గులేక నీళ్ళు తాగుతానికి వచ్చారా! నీళ్లులేవు ఏమీలేవు పొమ్మన్నారు. జప్తులు మానుకొని, తడి యారి పోతున్న గొంతుకలతో వచ్చిన దారినేపడ్డారు పోలీసులూ ఎస్టేటువారు. యీ విధంగా పురుషులు చూపించిన పోరాటమార్గాన్నే స్త్రీలు నడిచి జమీందారు జప్తులను విరమించుకొనేటట్లు చేసారు.

ఈ పోరాటంలో రైతులు ప్రదర్శించిన ధైర్యసాహసాలు అద్భుతం. 4 వ తేదీన తీవ్రమయిన లాఠీచార్జీ జరిగింది. కొంతమందిని అరెస్టుచేసి, కొంత మందిని విడిచేసారు. దళంలోని ఒక మంగలి యువకుడు, బాగా దెబ్బలు తగి లినవాడు తన్ను అరెస్టు చేయకపోగా ఏమిచేయాలో తెలియక ఇంటికి తిరిగి వచ్చాడు. గుమ్మంలోనే తండ్రి వీరయ్యగారు దుడ్డుకర్రతో ఎదురైనాడు. "వెధవా, రణభూమినివదలి పారిపోయి వస్తున్నావా వెనక్కు తిరుగు" అన్నాడు. కుమారుడు మళ్ళీ పరుగెత్తుకువెళ్ళి, నాగలి పుచ్చుకు చేలో ప్రవేశించి దున్నటం ప్రారంభించాడు. పోలీసులు వచ్చి అరెస్టుచేసారు.

ఆ రోజు తీవ్రమైన లాఠీచార్జీ జరిగింది. మరునాడు ఆ భూమిలోనికి ఎవరయినా ప్రవేశిస్తే పోలీసులు ఇక తుపాకులతో పేల్చేస్తారని ఎస్టేటువారు పుకార్లు వ్యాపింపజేసారు. మరునాడు ఎవరూ సత్యాగ్రహం చేస్తానికి రాకపోతే ప్రజల మనోధైర్యం చెదరిపోతుందిగదా, రైతులను భయపెట్టి ఇక లొంగదీయ వచ్చునుగదాయని ఎస్టేటువారి ఆశ. అందుకై రిజర్వుపోలీసు దళాలను చుట్టు పక్కల గ్రామాలలో అట్టహాసంగా తిప్పారు. మరునాడు ఉదయం 8 గంటల కల్లా కామ్రేడ్సు రంగయ్య, కనకయ్య, జానయ్య మొదలగు యువకుల నాయ కత్వాన రామాపురం దళంవచ్చి అరకలతో చేలోప్రవేశించింది. ఎస్టేటువారి కాళ్ళు చల్లబడ్డాయి. రామాపురం యువకవీరులు రైతు ప్రతాపమెట్టిదో ప్రపంచానికి రుచిచూపించారు.

ఈ విధంగా 17 రోజులు సత్యాగ్రహం సాగింది. చివరకు, రెవిన్యూ మంత్రి టంగుటూరి ప్రకాశం పంతులుగారు దిగిరాక తప్పిందికాదు. రాజీ షర తులను అమలుజరిపించ తాను హామీ యిస్తున్నానని నమ్మించి రైతు సంఘంచే

సత్యాగ్రహమును విరమింపజేసాడు. తర్వాత 3 నెలలకు శిక్షపడ్డ సుమారు 80 మంది రైతులను విడుదల చేసారు. కమ్యూనిస్టులనే కారణంతో మాత్రం కామ్రేడ్స్ ప్రసాదరావు, పరంధామయ్య, సత్యనారాయణలను విడుదల చేయ లేదు. ప్రకాశంగారు హామీయిచ్చారేగాని వాటిని అమలులో పెట్టుటకై ప్రయత్న మేమీ చేయలేదు. పాపయ్యగారి భూమిని వదలివేయటం మినహా మరే పనినీ జమీందారుచేయలేదు. రైతులే తమ సంఘబలంవల్ల అనేక పోరాటాలద్వారా వాటిని సాధించుకున్నారు. ఈ పోరాటాలలో జైళ్ళకు వెళ్ళిరావటం రైతులకు పరిపాటి అయిపోయింది. అయినా జైళ్ళు, పోలీసులు, రౌడీలు, ఈ భయం రైతులకు పోయింది.

## నేటి మునగాల

3 ఏండ్లు అనేక పోరాటాలు జరిపి, ఎన్నో కష్ట నష్టాలకోర్చి మునగాల రైతులు తమ హక్కులను నిలబెట్టుకున్నారు. ఈనాడు ఆ ఎస్టేటులో మామూలు జమీందారీ దౌర్జన్యాలు సాగటం లేదు. వెట్టిచాకిరి పూర్తిగా నాశనమైంది. చాకలి మంగలి మొదలగు వృత్తులవారి ఈనాములకు పట్టాలు పుట్టినవి. రైతులు వారి భూములలోని స్వంతచెట్లను యధేచ్ఛగా తామే అనుభవిస్తున్నారు. అక్రమ శిస్తులు పోయినవి ఎంతపరిమాణంవుందో అంతభూమికే శిస్తులుచెల్లిస్తున్నారు. పులివంటి జమీందారు నేడు పిల్లివలె అణగివున్నాడు.

ప్రజలలో ఇదివరకు తగాదాలువస్తే జమీందారు పిలిపించి, రెండుపార్టీ లనూ శిక్షించి జరిమానాలు వసూలు చేసేవాడు ఇప్పుడు ఎస్టేటులో ఏ తగాదా వచ్చినా రైతుసంఘంవద్దకు వస్తారు రైతుసంఘం పంచాయితీని ఏర్పాటుజేసి తగాదాను న్యాయంగా పరిష్కారం చేస్తుంది. ఎస్టేటులో ఏర్పడ్డ 5 గ్రూపు పంచాయితీ కోర్టులకు జమీందారూ, రైతుసంఘమూ పోటీచేయగా, అన్నిటి లోనూ రైతుసంఘమే గెల్చింది. రైతుసంఘమే సుమారు 15 కో-ఆపరేటివు సొసైటీలను నిర్వహిస్తూ రైతులనూ, కూలీలనూ, షాహుకార్ల దోపిడిని అరి కట్టుతోంది. ఎస్టేటులో రైతులపై వచ్చే దావాలన్నీ సమిష్టిగా రైతుసంఘమే నడుపుతోంది. 1943 నుండి ఎస్టేటులోదాన్యం కిరోసిన్, బట్టలు, యితర జీవితా వసర వస్తువుల కరువురాగా, ఒక కో-ఆపరేటివు స్టోర్సును నిర్మించుటకు కృషి జేసి, ఆ స్టోర్సు సక్రమంగా నిర్వహింపబడేటట్లు కృషిజేస్తోంది. నెల 1 కి 900 బస్తాలబియ్యం దిగుమతి చేయించి, అది యంతా మళ్ళీ నైజాంకు దొంగతనంగా ఎగుమతి కాకుండా కంట్రోలు రేటుకు ప్రజల కందుబాటు అయ్యేటట్లు చూస్తోంది.

ఈ రోజున మునగాల ఎస్టేటులో వెల్లివిరిసిన నూతన చైతన్యానికి ఒక్క వుదాహరణ చూపుతాను. కామ్రేడ్ ముత్తయ్య 16 ఏండ్ల యాదవకుల బాలుడు. గ్రామస్తుల సహాయంచే స్కూల్ ఫైనల్‌దాకా చదువుకున్నాడు. చదువుకాలంలో విద్యార్థిసంఘంలో చురుకుగా పనిజేసే సభ్యుడు. చదువు పూర్తిజేసుకొని ఇంటికి తిరిగి వచ్చిన పిమ్మట తనవలెనే ఉత్సాహపరులగు మరియిద్దరు యువకులతో ఆదర్శప్రాయమగు ఒక శాలశాలను పెట్టాడు. రైతు సంఘంలో ఒక ప్రధాన వ్యక్తియగు కుల్లు కోటయ్యగారు 50 సెంట్లభూమిని పాఠశాలకుగాను యిచ్చి బావినికూడా తవ్వించారు. చుట్టుప్రక్కల గ్రామాల బాలురు సుమారు 25 మంది ఆ పాఠశాలలో చదువుకుంటున్నారు. రాత్రిపూట వ్యవసాయ కూలీలు 20 మంది వరకూవచ్చి విద్యనభ్యసిస్తున్నారు. లోగడ కొద్దిగా చదివి మానివేసిన యువకులుకూడా తిరిగి యింగ్లీషు చదువుకొని 3 వ ఫారంవరకూ వచ్చారు.



కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య

ఈ స్కూలు నూతన పద్ధతులపై ఒక గురుకులంలాగా నడుపబడుతూ వుంది. విద్యార్థులిచ్చే వేతనాలలో కొంతభాగాన్ని ఉపాధ్యాయులు ముగ్గురూ పంచుకుంటారు. కొంతభాగాన్ని పాఠశాల అభివృద్ధికి వినియోగిస్తారు. విద్యార్థులకు ప్రథమంనుండీ దేశభక్తి. రైతులు, కూలీల ఆర్థిక పరిస్థితినిగూర్చి, సామ్రాజ్యవాదం దోపిడినిగూర్చి కథల రూపకంగా, పాటల రూపకంగా నేర్పబడుతూ వుంటాయి. ఈవిధంగా ఎస్టేటులో బాలవీరులు ఈ పాఠశాలద్వారా తర్ఫీదు పొందుతున్నారు. తమ తర్వాతతరంవారిలో కల్గుచున్న ఈ అపూర్వ చైత

న్యాన్నీ, విజ్ఞానాన్నిచూసి రైతుపెద్దలు సంతోషిస్తూ పాఠశాలకు కావలసిన ఇతర సహాయములను అంతకంతకూ అధికంగా జేస్తున్నారు.

ఈనాడు మునగాలరైతు పూర్వ-మాదిరి జమీందారు బానిసకాదు. తన హక్కులను సాధిస్తావికై ధీరతతో నిలబడ్డయోధుడు. ఈనాడు రైతుసంఘం ఆర్గనైజర్లుగా, విద్యార్థిసంఘ నాయకులుగా, లేక సహకార పాఠశాలా స్థాపకులుగా పనిజేస్తున్న కమ్యూనిస్టు యువకులగు అప్పయ్య, ముత్తయ్య, నారాయణ మొదలగువారు 1938, 39, 40 పోరాటాలలో బాలురుగావుండి. వాటివల్ల వుత్తేజితులైనవారు. ఆనాడు వుద్యమంలో ప్రధానపాత్ర వహించిన వారిలో చాలా మంది ఈనాడు కమ్యూనిస్టుపార్టీ సభ్యులు. పార్టీసానుభూతిపరులు. ఎఱ్ఱజండా మునగాల ప్రజలజండా. జమీన్ రైతుసంఘం ప్రజలకుటుంబం; కమ్యూనిస్టుపార్టీ వారి నాయకుడు.

---

# యుద్ధకాలంలో ఉద్యమం

1936 - 39 కాలంలో ఆంధ్రరైతు ఉద్యమానికి ఒక స్థిరత్వమూ, ఒక స్థాయీ వచ్చినవి. అనేక జిల్లా, తాలూకా, గ్రామసంఘాలు యేర్పడి నిర్మాణంగా పనిచేస్తూండటమూ, జాతీయోద్యమం సహితం చొరనటువంటి రాయలసీమ మున్నగు ప్రాంతాలలోగూడా రైతుఉద్యమం ప్రభవించడం జరిగింది. జమీన్ రైతుల సమస్యలు, ఇరిగేషన్ సమస్యలు, అటవీ సమస్యలు, రీసెటిల్మెంటు, అప్పులబాధ మున్నగు అనేకసమస్యలపై అమోఘమగు కృషిజరిగింది.



కీ. శే. కామ్రేడ్ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి

ప్రకాశంకమిటీ సంచారంలో బ్రహ్మాండమగు ప్రదర్శనలు జరపడమే గాక, ఎన్నికల ప్రచారంలో కాంగ్రెసువాది అడుగునైనా పెట్టుట కలవికాని మునగాల ఎస్టేటుతోసహా అనేక ఎస్టేటులనుండి అమూల్యమగు సాక్ష్యముల సేకరించి కమిటీముందు యిప్పించుట జరిగింది. ఋణనివారణచట్టమునుగూర్చి అనేక యాత్రలు, ప్రదర్శనలు మూలంగా వడ్డీవ్యాపారుల వ్యతిరేకత వెనుద్యాని

చట్టాన్ని ప్యాసుచేయుటకు కాంగ్రెసు మంత్రులకు బలాన్ని చేకూర్చుట జరిగింది. బీటి పుల్లరివి తగ్గించుటకు, అప్పాపురం ప్రాజెక్టుక్రింద శిస్తులు తగ్గించుటకు, రాయలసీమ కరువుప్రాంతాలలో శిస్తురిమిషన్లు యివ్వబడుటకు విశేషమగు కృషి జరిగింది. ఈ ఆందోళన నంతటినీ సమన్వయపరచి రాష్ట్రవ్యాపితమగు ఒక మహోద్యమంగా, యే కర్నూలు జిల్లాలోనో జరిగే అటవీ సమస్యపై చేసే ఆందోళనకు రాష్ట్ర మంతటనుండీ సహాయం లభించేటట్లుగా ఆంధ్ర రాష్ట్రరైతుసంఘం కృషిచేసింది. ఈ విధంగా రాష్ట్రరైతువుద్యమాన్ని పెంపొందించటానికి ముఖ్యకారకులు కాటన్టే కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, చలసాని వాసుదేవరావుగార్లు మరల 1938 లోనూ 1939 లో కూడారాష్ట్ర సంఘ అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు.

యుద్ధంవచ్చింది. ప్రథమ కబళంగా అనేకమంది కమ్యూనిస్టులు అరెస్టు గావింపబడ్డారు. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు కీర్తిశేషులైనారు. కామ్రేడ్స్ వాసుదేవరావు, రామలింగయ్య, పట్టాభిరామయ్య, నాగభూషణం వగయిరాలు రహస్యజీవనం గడపవలసి వచ్చింది. లక్ష్మీనరసరాజు, సత్యనారాయణదాసు, సూర్యనారాయణరాజు, ప్రసాదరావు, శంకరయ్య, సదాశివన్ మున్నగు అనేకులు జైళ్ళలోను, డిటెన్షన్ క్యాంపుల్లోనూ నిర్బధించబడ్డారు. దీనితో గోగినేని రంగనాయకులుగారికి చక్కటిఅవకాశం లభించింది. రాష్ట్రసంఘాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకున్నాడు. కమ్యూనిస్టులను రైతు సంఘాలనుండి తరిమివేయడానికి పూర్తిగా ప్రయత్నాలు సాగించాడు. అది సాధ్యంగాక చివరకు 1942 అక్టోబరులో రాష్ట్రరైతుసంఘాన్నే రద్దుచేయ సంకల్పించాడు.

1942 అక్టోబరు ఆంధ్రరైతు వుద్యమంలో మహా విషమపరిస్థితిని తెచ్చి పెట్టింది. ఒక వైపున ప్రభుత్వం నిర్బంధ విధానాన్ని జోరుగా సాగిస్తోంది. కాల్పులు, సాముదాయక జరిమానాలు మున్నగు అత్యాచారాలు దారుణంగా సాగుచున్నాయి. రెండోప్రక్క కోపావేశులగు ప్రజలు, కాంగ్రెసు వాదులు అరాచక చర్యలు తీవ్రంగా సాగిస్తున్నారు. ఇంకొకమూల ఆహారసమస్య రాష్ట్రంలో తీవ్ర రూపం దాల్చింది. రాయలసీమలో పంటలు పూర్తిగాపోయి కాటక పరిస్థితు లేర్పడ్డాయి. వీటన్నిటికీ తోడు జపాను దాడిప్రమాదం హెచ్చింది. బెంగాలుపై బాంబులవర్షం కురుస్తోంది. ఇట్టి పరిస్థితుల్లో రైతుసంఘం ఐక్యతతో, సంఘ బలంతో యీ సమస్యలన్నిటినీ ఎదుర్కొని పరిష్కరించాలి. లేదా రైతాంగం ప్రభుత్వ నిర్బంధ విధానానికి, కరువు మంటలకు ఆహుతి అయిపోతుంది.

జపానుదాడి సులభతర మవుతుంది. సరిగ్గా యిట్టి పరిస్థితులలో రంగనాయకులు గారు తన ముఠాతో పూర్తిగా అరాచక చర్యలలో దిగిపోయి, రాష్ట్ర, జిల్లా, తాలూకా, గ్రామసంఘా లన్నిటినీ రద్దుచేయ సంకల్పించారు.

ఇది ఆత్మ విధ్వంసకమనీ, అస్త్రసన్యాసమనీ కమ్యూనిష్టులం ఖండించాం. ఏ జిల్లా రైతుసంఘమూ రంగనాయకులుగారి యీ చర్యను సమర్థించక, ప్రతిదీ ఖండించింది. అందుచే తిరిగి రాష్ట్ర రైతు వుద్యమాన్ని



కామ్రేడ్ చలసాని వాసుదేవరావు

చక్కా—విపట్టి నడపవలసినభారం కామ్రేడ్ వాసుదేవరావుపై పడింది. తాను అస్వస్థతతోవున్నా, రైతుసంఘాన్ని పునర్నిర్మించుటకై కామ్రేడ్ వాసుదేవరావు కార్యరంగంలో దుమికి ఒక్క—నెల రోజులలో 11 జిల్లాలలోనూ రైతుసంఘాలను నిర్మించ కృషిచేసాడు. కమ్యూనిష్టులు ద్విగుణీకృతోత్సాహంతో కృషిచేసి నెల రోజులలో 55,560 మంది సభ్యులను, అనగా అంతకుపూర్వ మెన్నడూ లేనంత హెచ్చుమందిని సంఘాలలో చేర్పించారు. ఇప్పటినుండి రంగనాయకులు ముఠా ఎన్ని అవరోధములు కల్పిస్తూ వున్నప్పటికీ, రైతువుద్యమం వురకలు వేసుకుంటూ ముందుకు సాగిపోనారంభించింది.



# కరువు పెద్దమ్మ దాపురించింది

పంటపండిన, కరువు - పాడిగల్గిన, దప్పి
పాలబడిపోయినదిరా, - సోదరా!
భారతావని చూడరా
ప్రక్కరాయలసీమ - పైనబెంగాలులో
కాటకము రగిలిందిరా, సోదరా!
కడుపుకన్నము లేదురా.
చేయెత్తిధర్మాలు - చేయగావలెబాబు
వేయిరూకలుగాదురా, సోదరా!
వేయిమూకలుచాలురా.
మాతెల్గువాడవీ - మా భారతీయుడవి
దంభోక్తిలో కాదురా, సోదరా!
దాతవై ఆదుకోరా.
కదలింపరాగుండె - కరగిప్రవహింపవీ
మనిషితెచ్చిన కరువురా, సోదరా!
మానవుడె తీర్చాలిరా.

కొనకళ్ళ వెంకటరత్నం—

కమ్యూనిస్టులు హెచ్చరించినట్లుగానే రాయలసీమలో 1943 లోనూ, ఉత్తర విశాఖలో 1944లోనూ మహాతీవ్రమగు కరువువచ్చింది. రాయలసీమలో పంటలు పూర్తిగా పోయినవి. మనుష్యులకు తినటానికితిండి, పశువులకు మేత, త్రాగడానికినీరుకూడా కరువైనవి. రైతులు ముందుసంవత్సరపు వ్యవసాయం సంగతి ఆలోచించకుండానే దుక్కిటెద్లను సయితం కసాయి దుకాణాలకు అమ్మి వేయసాగారు. రాయలసీమలో వచ్చిన కరువుకంటె ఉత్తరవిశాఖలో వచ్చినది మరీ దారుణమైనది. ఇక్కడి కరువుకుతోడు మలేరియా, మశూచి, కలరా మున్నగు అంటువ్యాధులు ప్రబలి వేలకొలది ప్రజలను పొట్టబెట్టుకున్నాయి. గజ్జి, దురదలు రక్కెన కంపవలె వ్యాపించిపోయినవి. ఈ జబ్బులన్నీ తిండిలేకనే వచ్చేవని సుప్రసిద్ధ డాక్టర్లే చెప్పారు. రాయలసీమలోను, వుత్తర విశాఖలోను కూడా ప్రజలు తిండి దొరక్కపోవుటచే దేవదారాకు, కలవదుంపలు, గజ్జేరు మున్నగు ఆకు అలములుతిని, అవి జీర్ణంగాక, వికటించగా ప్రాణాలను విడిచే వారు. వీటికితోడు వుత్తరవిశాఖలో బర్మా కాందిశీకుల సమస్య ఒకటివుంది. అందుచే పరిస్థితులు చాలా విషమరూపం దాల్చినవి. వేలకొలది ప్రజలు

బొంబాయి, పూనా, కలకత్తా మున్నగు పట్టణాలకు అడుక్కు తినడానికి ప్రయాణమై పోయారు. ఉత్తర విశాఖలో గ్రామాలకు గ్రామాలే నాశన మైపోయినవి. కరువు నివారణకై ప్రభుత్వం తాపీగా ఆలోచించడం మొదలుపెట్టింది. కళ్ళనీరు తుడిచినట్లుగా యేవో కొద్ది శామనివారణ క్యాంపులను మాత్రం పెట్టి కూర్చున్నది. రాయలసీమలో ప్రజలు దోపిడీలకు, అరాచక చర్యలకు పూనుకొన్నారు. కర్నూలు పట్టణ ప్రాంతంలోనే, పట్టణంలోకూడా వరుసగా మూడుసార్లు సంత బజార్లు దోచుకోబడినవి. అందుచే కరువు నివారణ ఆంధ్ర ప్రజల ప్రధాన సమస్య అయినది.

## కరువు నివారణలో రాఘవరెడ్డి ఆత్మ బలిదానం

కరువు నివారణ యేవిధంగా సాధ్యం కాగలదు? ప్రభుత్వం కేవలం కొన్ని కరువు క్యాంపులను తెరవడంతోనే కరువు నివారణ జరగదు. బాగాపండే కృష్ణా, గోదావరి జిల్లాలనుండి కరువు ప్రాంతాలకు ధాన్యం సప్లయి కావాలి. ధాన్యం కంట్రోలుడిపోలద్వారా సరసమగు రేట్లకు ప్రజలకు అమ్మించ బడాలి. దొంగ వ్యాపారాన్ని రూపుమాపాలి. ఎక్కువ కరువు క్యాంపులను పెట్టాలి. కేవలం రాళ్ళుకొట్టడం, రోడ్లువేయడం కాక, జలాధారాల మరమ్మతుకై కృషి జరిగినచో కరువు ప్రాంతాలే సస్యశ్యామలమై కరువురాక్షసి తొంగిచూచుటకు కూడా వీలులేకుండా పోతుంది. ఈ పనులన్నీ జరగాలంటే ప్రభుత్వమూ, ప్రజలు కలిసి పూనుకోవాలి. ప్రభుత్వంయొక్క అలక్ష్య భావాన్ని వదలగొట్టడానికై ఆంధ్ర ప్రజానీకం తీవ్ర ఆందోళనను కొనసాగించాలి.

ఆంధ్రప్రజలయొక్క కర్తవ్యం స్పష్టంగా కన్పిస్తున్నదే. కాని కాంగ్రెసు దేశభక్తులకు యీ కరువు నివారణ రుచించలేదు. ఇందుకు పూనుకుంటే ప్రభుత్వంతో సహకరించడంకాదా! దానికి లోబడి పోవటంకాదా! అని వితర్కించడం మొదలెట్టారు. ఇక రంగనాయకులు ముఠాకు యీ కరువు మంటలలో విప్లవ జ్వాల కన్పించింది. కరువెక్కువైతే ప్రజల్లో తిరుగుబాటు ఎక్కువత్వరగా వస్తుందట! ఆ విధంగా విప్లవం వస్తుందట! ప్రభుత్వాన్ని కూలద్రోయ వచ్చునట! ఇదీ రంగనాయకుల ముఠా ' విప్లవ సిద్ధాంతం '

కాని కరువువల్ల చచ్చేది మన ప్రజలు, మన ఆంధ్రసోదరీ సోదరులు. ఇందువల్ల విప్లవంరాదు సరికదా, ప్రజలు నైతికంగా పతనం చెందటం, జాతీయోద్యమం నాశనం కావటం, గ్రామ సీమలు, స్మశాన వాటికలుగా తయారుకావటం జరుగుతుంది. అందుచే కాంగ్రెసు పెద్దలు కలిసిరాకపోయినా, రంగనాయకులు

ముఠా ఎంతో దుష్ప్రచారాన్ని సాగించినా ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం ఒంటరిగా కరువునివారణ ఆందోళనను ప్రారంభించింది. క్షామనివారణ కమిటీ నేర్పరచి విరాళముల వసూళ్లు ప్రారంభించింది. వివిధ కార్మిక, విద్యార్థి, యువజన బాల, స్త్రీ సంఘాలు యిందుకెంతో తోడ్పడినవి. మొదట్లో కాంగ్రెసువాదులు కలిసి రాకపోయినా వారి సహకారాపేక్షై ఎడతెగని కృషిచేసింది. వీరి చుట్టూ, ఆంధ్ర మహాసభచుట్టూ ఎన్నోసార్లు తిరిగింది. చివరకు వీరు కదిలారు. ఆంధ్రమహాసభ పక్షాన మరొక రాయలసీమ క్షామనివారణ కమిటీని యేర్పరచి ఆందోళన ప్రారంభించారు కర్నూలు, కడప, అనంతపురం, విశాఖ మున్నగు జిల్లాల్లో కాంగ్రెసువాదులు, కమ్యూనిస్టులు, ఇతర పెద్దలు, జస్టిస్‌పార్టీవారు, ముస్లింలీగర్లు కలిగిన ఐక్య క్షామనివారణకమిటీ లేర్పడి పని ప్రారంభించినవి. ఈ ఐక్యఆందోళన ఫలితంగా ప్రభుత్వం రాయలసీమలో 70 కి పైగా కరువు క్యాంపులను తెరచి వాటిల్లో 4 లక్షల 50 వేలకుపైగా క్షామపీడితులకు పని కల్పించింది.



కామ్రేడ్ కడియాల గోపాలరావు

ఈ కరువు క్యాంపులలో జరిగే అక్రమాలకు అంతులేదు. అందుచే వీటిల్లో జరిగే అక్రమాలను అరికట్టి, పనిచేసే కూలీలకు న్యాయం చేయటం ఒక ప్రధాన

కర్తవ్యమయ్యింది. కాబట్టి కరువు క్యాంపులవద్ద పనిచేసేందుకు ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం రాయలసీమకు 30 మందిని, ఉత్తర విశాఖకు 12 మందిని వాలంటీర్లను పంపింది. వారు ఎన్నో శ్రమలకోర్చి, తిండి తిప్పలు లేకపోయినా ఆఫీసర్లెన్నో బాధలుపెట్టినా, కూలీల కష్టనివారణకై పాటుబడ్డారు. వీరు క్రొత్త వారగుటచే భయంవల్ల గ్రామస్థులు ప్రథమంలో సహాయంచేసేవారుకారు. ఆటువంటప్పుడు వీరు అడవినుండి కట్టెలుతెచ్చుకొని, 3 మైళ్ళదూరానవుండే బావుల నుండి నీరుతెచ్చుకొని, ఏ చెట్టుక్రిందనో ఇన్నిజొన్నలు వుడుకబెట్టుకొనితింటూ ఆ జొన్నలూ దొరక్కపోయినప్పుడు పస్తులుంటూ రాత్రనక, పగలనక, పని చేశారు. వీరిని అధికార్లు, పోలీసులు పెట్టిన బాధలు అనంతం. 600 మంది కూలీలను సబ్‌డివిజనల్ ఆఫీసరువద్దకు రాయబారం తీసుకొని వెళ్ళినందుకు జాక్ మేజిస్ట్రేటు అచ్చట వాలంటీర్లను బలవంతంగా వెళ్ళగొట్టించాడు. పదిమంది కూలీలను వెంటబెట్టుకొని వారిని క్యాంపులో జేర్చుకోమని అడుగుటకై కామ్రేడ్ ఆంజనేయులు బి. అగ్రహారం చార్జి ఆఫీసరు దగ్గరకువెళ్ళితే, ఆఫీసరు కూలీలను తన్ని, ఆంజనేయులను కొట్టాడు. కామ్రేడ్ కుమారస్వామిని కరివేముల చార్జి ఆఫీసరు తిట్టి నెట్టివేసాడు. జాక్ క్యాంపులో పనిచేసే కామ్రేడ్స్ సోమశేఖరరావు బాపయ్యలను పోలీసులు అరెస్టుచేసి కేసుపెట్టారు. (కామ్రేడ్ సోమశేఖరరావు కరువు క్యాంపులో వుద్యోగి. అచ్చటజరిగే ఘోరాలను చూడలేక వుద్యోగానికిరాజీనామాయిచ్చి రైతుసంఘ వలంటీరుగా కూలీల కష్టనివారణకై పనిచేయ ప్రారంభించాడు. పోలీసులు పెట్టిన కేసు చివరకు కొట్టివేయబడింది.) ఉత్తర విశాఖకువెళ్ళిన వలంటీర్లకు అచ్చటి వుద్యోగులు బియ్యం దొరక్కుండా చేసేవారు. అద్దెకు వున్న యిండ్లలోనుండి యిండ్ల యజమానులను భయపెట్టి వెళ్ళగొట్టించారు. ఇన్ని కష్టాలనూ భరించి కామ్రేడ్స్ కరువు నివారణకై అద్భుతమగు కృషిచేశారు. సుఖజీవనానికి అలవాటుపడ్డ ఈ రైతుసేవకులు కృష్ణా, గుంటూరు జిల్లాలనుండివెళ్ళి పరాయి ప్రాంతాలలో అష్టకష్టాలకోర్చి, ప్రభుత్వ నిర్బంధాలను, దొంగవ్యాపారులు, లంచగొండులు అగు ప్రజా వ్యతిరేకులను ఎదుర్కొంటూ, మానవ సేవకూ రైతుఉద్యమవ్యాప్తికి తమ జీవితాలను అంకితం చేశారు. ప్రపంచ చరిత్రలో ఎంతోమంది శాస్త్రవేత్తలు, మతబోధకులు, రాజకీయవేత్తలు మానవసేవలో తమ ప్రాణాల నర్పించి అజరామరమగు కీర్తిని సంపాదించారు. అట్టి వుత్తమ సాంప్రదాయాలను సాగిస్తూ ఈ రైతుయువకులు కరువుబాధితులకు సేవచేయుటకు తమ శక్తినంతటినీ ధారపోసారు. అనన్యమగు యీ వీరత్వమే కామ్రేడ్ రాఘవరెడ్డి జీవితంలో గోచరిస్తున్నది.

ఉత్తర విశాఖ పరిస్థితులను వివరించి "మీరు అక్కడికివెళ్ళి పని చేయాలి. అదికరువు ప్రాంతంసుమా! భోజనసదుపాయాలు సక్రమంగా వుండవు. కలోగంజో గ్రుక్కెడు త్రాగి పనిచేయాలి. అంటువ్యాధులు అమితంగా చెలరేగు చున్నవి. నా అని పలుకరించేవాడెవడూ వుండడు." అని కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రకమిటీ కార్యదర్శి కామ్రేడ్ రాజేశ్వరరావు అడిగాడు తన చుట్టూవున్న కమ్యూనిస్టుయువకులను వుద్దేశించి. నేను వెళ్ళుతానని నిర్భయంగా ముందుకు వచ్చినవాంలో గుడివాడ తాలూకా లింగవరం కాపురస్థుడు, 22 యేండ్ల రైతు యువకుడు కామ్రేడ్ కొండపల్లి రాఘవరెడ్డిఒకడు.

ఉత్తరవిశాఖలో కరువుపిశాచం తాండవంచేస్తున్నరోజులవి. ప్రజలు తిండి లేక వేలకొలదిగా మరణిస్తున్నారు. కుటుంబాలకు కుటుంబాలు విచ్ఛిన్నమై పోతు న్నవి. గ్రామాలు నామ రూపాలు లేకుండా ధ్వంసమై పోతున్నవి. తల్లులు తమ పిల్లలను కాసీకి, ఏగానీకి అమ్ముకొనే రోజులవి. కలరా, మశూచి, మలేరియా, గజ్జిమున్నగు అంటువ్యాధులు, శల్యాలుగా వున్న ప్రజలపై వీర విహారం చేస్తు న్నసమయమది. ఆరోజుల్లో. ఆ ప్రజలమధ్య నిద్రాహారాలు మానేసి ప్రజారక్ష ణకు పూనుకొని పనిచేసారు ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం పంపిన వాలంటీర్లు. ఎన్ని కష్టాలువచ్చినా, వారాభయంకర వాతావరణాన్ని ఎదుర్కొని పనిచేసారు. కాశీ బుగ్గలో, సోంపేటలో, బారువలో, ఇచ్ఛాపురంలో క్యాంపులేర్పరచుకొని, అచ్చటి ప్రజాసేవకుల సహాయంతో కరువు నివారణకు పూనుకున్నారు. ఇందుకై అచ్చట రైతుసంఘాలను నిర్మించి. విచ్ఛిన్నమైన రైతువుద్యమాన్ని పునస్థాపించారు, వీరి కృషిఫలితంగాను, ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం గావించిన ఆందోళన మూల కంగాను యితరపెద్దలు, సంఘాలు మేల్కొని కరువు నివారణకు కృషిచేయ ప్రారంభించారు. ప్రముఖులందరితోనూ కూడిన జిల్లా కరువు నివారణసంఘం, ఆంధ్ర వైద్యమండలి మున్నగునవి కరువు నివారణకు పాటుబడ సాగినవి. ఈ ఆందోళనా ఫలితంగానే ప్రభుత్వంకూడా కదిలి రేషనింగును ప్రవేశపెట్టటం, వుచిత భోజనశాలలను తెరవటం గావించింది.

కాని చివరకు కరువుపిశాచం ఈ వీరుల నొక్కొక్కరినే లొంగదీసింది. ఒక్కొక్కరే రోగపీడితు లయ్యారు. రాఘవరెడ్డిమాత్రం అచంచలంగా నిల బడ్డాడు. రోగాలువచ్చినా తన సేవనుమాత్రం మానలేదు. ఇంటికివెళ్ళి ఆరో గ్యాన్ని సరికూర్చుకొని మరల కరువు ప్రదేశంలో యిమమడించిన దీక్షతో ప్రవేశించాడు. గ్రామగ్రామాన రైతుసంఘాలు పెట్టాడు. రంగా ముఠాకు కొంత బలమున్న ఆ ప్రాంతంలో ఎర్రజెండాను ప్రతిష్ఠించాడు. రంగ నాయకుల అను

చరులలో అధికభాగాన్ని ఆంధ్రరాష్ట్ర రైతుసంఘంలోకి తీసుకురాగలిగాడు. రానురాను అతని ఆరోగ్యం మరల క్షీణించింది. కాని, యీ వీరుడు తన కృషిని మరింత తీవ్రంగావించాడు. ఫలితంగా టైఫాయిడ్ వాతబడ్డాడు. చివరకు 7-9-45 న ప్రజా సేవకోసం నిర్మింపబడ్డ సోంపేట క్యాంపు ఆసుపత్రిలో తన మిత్రబృందం సన్నిధిలో తన అసువులను వీడాడు. మానవ సేవలో ఆత్మబలి దానాన్ని గావించిన వీరులశ్రేణిలో మరొకపేరు చేర్చబడింది.



సిక్కోలు కరవు నివారణకు పనిచేసిన రైతు వాలంటీరుదళం

కామ్రేడ్ రఘువరెడ్డి, అతని సహచరులు గావించిన కృషి ఫలించింది. రాయలసీమలో 1943 లో దాపురించిన కరవు యీ శతాబ్దంలో వచ్చిన వాటిలో కల్లా తీవ్రమైనదైనా ఒక్క మనిషికూడా ప్రాణాలు వీడనవసరం లేకుండా ఆదుకో గలిగాం. రాయలసీమకు బెంగాలుగతి పట్టకుండా కాపాడగలిగాము. వెనకపడ్డ రాయలసీమలో కూడా బలమైన రైతుఉద్యమం నిర్మించబడింది. రాయలసీమ, సర్కారుల మధ్యగల వైమనస్యాలు తగ్గుటకు తోడ్పడింది. ఇట్టి మహత్కార్యాన్ని సాధించుటకై ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం గావించిన కృషి అమూల్యం.

# కరువు బాధితులకు అన్నంపెట్టడమే ఉత్తమ దేశభక్తి

ఒక్క రాయలసీమలోను, ఉత్తర విశాఖలోనేకాదు, డెల్టాజిల్లాల్లోని మెట్టప్రాంతాల్లోకూడా యీ కరువు పరిస్థితు లేర్పడ్డవి. దీనికి కారణం ప్రధానంగా తిండి దొంగలే. మామూలుగా సామాన్యరైతు పంటకల్లంలోనే ధాన్యాన్నిఅమ్మి వేస్తాడు. ఈ ధాన్యాన్ని చే జిక్కించుకున్న వ్యాపారులు, మిల్లు యజమానులు దీనిని దాచివేసి విపరీతంగా దొంగవ్యాపారాన్ని సాగించారు. ప్రభుత్వంకూడా వీరి కనుకూలమైన విధానాన్నే అవలంబించింది. దొంగవ్యాపారం సాగడానికి లైన్ క్లియర్ యివ్వబడింది. షావుకార్లు రెండుచేతులతోనూ దోచుకోవడం ప్రారంభించారు. రాయలసీమలో సామాన్య ప్రజలకు రూపాయికి శేరున్నర బియ్యం కూడా దొరకడం దుర్లభమై పోయింది.

ఇట్టి పరిస్థితులలో రంగనాయకుల ముఠావైఖరి యేమిటి? ధరలు పెరిగే దాకా ధాన్యం అమ్మవద్దని రైతులకు హితబోధ చేసారు. రైతులవద్ద ధాన్యమే లేదన్నారు. రేషనింగును, కమాండీరింగును వ్యతిరేకించారు. కరువు ప్రాంతాలకు వెళ్ళితే రూపాయకు 6 శేర్లు బియ్యం కావాలని కోరేవారు: డెల్టా ప్రాంతాలకువస్తే రూపాయకు 3 శేర్లు బియ్యంకూడారాని హెచ్చుధరలను వర్తకుకోరే వారు. ఈ విధంగా, దేశం ఎట్లా తగలబడితే మనకేమి; మనకు హెచ్చుధరలు రావాలి అని కూర్చున్న దొంగవ్యాపారులకు తోడ్పడ్డారు.

అయితే కృష్ణాజిల్లా రైతులే ధాన్యం అమ్మకపోతే రాయలసీమ వాస్తవ్యులకు తిండి ఎక్కడనుండి వస్తుంది? కృష్ణాజిల్లా రైతులు పోషించకపోతే పరాయి ప్రభుత్వం ఏ ఇంగ్లాండునుంచిగానీ దిగుమతిచేసి పోషిస్తుందా? ఈ మాత్రం యోచన లేకపోయింది రంగనాయకులు ముఠాకు. అందుచే కరువు ప్రజలకు తిండి నందజేయుటకై కృష్ణా, గోదావరి డెల్టాల ప్రజల మేలొక్కల్పుటకై ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం పూనుకొన్నది. ధరలు పెరిగేవరకూ అమ్మగూడదని డెల్టా రైతులు కూర్చుంటే రాయలసీమ ప్రజల ప్రాణాలు అంతవరకు ఆగవని. ఈనాడు మన ప్రజలను రక్షించుకొనుటే వుత్తమ దేశభక్తియని ప్రబోధం గావించింది. ఇందువల్ల డెల్టా రైతాంగం ఎంతో ఔదార్యంతో ముందుకు వచ్చారు. తమ తోటి ఆంధ్రసోదరులను తాముపోషించకపోతే మరెవ్వరు పోషిస్తారనేది గుర్తిం

దారు. కరువు నిధికి ధారాళంగా విరాళాలివ్వడమేగాకుండా, కరువు ప్రాంతాలకు ధాన్యం పంపడానికికూడా సిద్ధమయ్యారు. మైలవరం ఫిర్కా రైతుల ఔదార్యం దీనికి చక్కటి ఉదాహరణ.

మైలవరం ఫిర్కా (కృష్ణాజిల్లా) లో మొత్తం 38 గ్రామాలున్నాయి. 8 గ్రామాలలో మాత్రం చెరువులక్రింద ధాన్యం. మిగతా గ్రామాలలో వేరుశనగ పండుతవి. ఈ 8 గ్రామాలవారు మైలవరం ఫ్యాక్టరీకి ధాన్యం అమ్మటం, ఆ మిల్లువారు ధాన్యాన్ని బియ్యంగా ఆడి మిగతా గ్రామాలకు సప్లయి చేయటం మామూలుగా జరుగుతూ వుంటుంది.

కాని యుద్ధ పరిస్థితులలో ధరలు పెరుగుతవి గదాయనే వుద్దేశంతో రైతులు ధాన్యం అమ్మటం మానివేసారు. వెంటనే దొంగ మార్కెటుకు చక్కటి అవకాశం దొరికింది. మిల్లు యజమానులూ, షాహుకార్లూ బెజవాడనుండి బియ్యం తెచ్చి హెచ్చుధరలకు అమ్మడం సాగించారు. ఫిర్కాలోని పేద రైతులూ, కూలీలు ఈ ధరలకు కొనలేక విశేషమగు యిబ్బందులకు లోనైనారు.

బెజవాడ తాలూకా రైతుసంఘం ఈ పరిస్థితులను గుర్తించింది. కుంటుముక్కల జమీందారుదగ్గర నిల్వవున్న 1000 బస్తాల ధాన్యాన్ని స్థానికాధికారుల సహాయంతో మిల్లుకు బ 1కి 10-14-0 చొ॥ యిచ్చునట్లు చేసారు. ఇద్దరు రైతులను కూడా ఒప్పించి మరొక 200 బస్తాలను ఇప్పించారు. ఆ తేదీనే తాశీల్దారు వెల్వడంగ్రామం వచ్చి 5 ఎ॥లకు పైగా భూమివున్న ప్రతిరైతూ ఎ 1కి 12 బస్తాల చొ॥ధాన్యం యివ్వవలసినదనీ, లేని యెడల రిక్విజిషన్ చేస్తామనీ బెదిరించాడు. కాని రైతులు తమవద్ద ఏమీ సరుకులేదని చెప్పారు.

వెంటనే రైతుసంఘ సేవకులు కల్పించుకున్నారు. నిల్వ వ్యాపారుల మాదిరి రైతులుకూడా ప్రవర్తిస్తే మిగతా గ్రామాలకు ఏవిధంగా ముప్పు వాటిల్లుతుందో, ఎలా మిల్లు యజమానుల దురాశకు బలియివ్వడమౌతుందో తెలియజేసారు. రైతుల దేశభక్తికి విజ్ఞప్తిచేసారు. ఫలితంగా 2 రోజులలో 400 బస్తాల ధాన్యం బ 1కి 10-14-0 చొ॥ వచ్చింది. ఈ 400 బస్తాలు, కుంటుముక్కలలో లభించిన 1200 బస్తాలు, రెవిన్యూ ఇన్స్పెక్టరు చీటీలేనిదే మిల్లు యజమానులెవ్వరికీ అమ్మకూడదని ఉత్తరవు జారీచేయబడింది.

అయితే ఈసరుకు ఎన్నాళ్ళు వస్తుంది? మిల్లు యజమానులు కూడా ఈ కంట్రోలు వ్యాపారం సాగుతే తమకు హెచ్చులాభాలు రావు కాబట్టి కొనటం మానివేద్దామని తలిచారు. ఈ విషయాన్ని గ్రహించి రైతుసంఘం వర్కర్లు

మిల్లు యజమానివద్దకు వెళ్ళారు. ప్రజలు కరవు కాటకాలతో బాధపడుతూవుంటే అధిక లాభాలకొరకు దేవుళ్ళాడటం మంచిది కాదని విజ్ఞప్తి చేసారు. న్యాయమైనలాభం తీసుకొని, రైతుకు సక్రమమైన ధరయిస్తే సరుకు లభిస్తుందని సూచించారు. మిల్లు యజమాని అంగీకరించాడు. బ. 1 కి 10-14-0 లు ధర యిస్తానని వాగ్దానం చేసాడు. రైతుసంఘం వర్కర్లు యీ విషయం రైతులకు తెలియజేస్తే, వెల్వడంలో వెంటనే 400 బస్తాలు, గణపవరంలో 8 గురు రైతులు 400 బస్తాల ధాన్యమును విడుదలచేసారు. ఈ విధంగా రైతులు దేశభక్తితో ముందుకువచ్చి కరువుబాధితుల పోషణకై తమవద్దనున్న ధాన్యాన్ని న్యాయమగు ధరలకు అందించసాగారు. ఈవిధంగా రాష్ట్రంలో అనేక ప్రాంతాలలో రైతులు కరువు నివారణకై ధాన్యాన్ని అందించ ముందుకువచ్చారు.

## దొంగవ్యాపారం అరికట్టబడింది

కాని రైతులు ధాన్యం అమ్మితేమాత్రం అది కొనుక్కునే పేదప్రజలకు అందవద్దా: చేతికీ నోటికీమధ్య ఎన్ని అడ్డంకులు? గుడినీ, గుళ్ళో లింగాన్నీ కూడా మింగే వ్యాపారులు ఎంతమందిలేరు? అందుచే రైతుసంఘం చొరవతో రాష్ట్రం నలుమూలలా ఆహారకమిటీ లేర్పడి ధాన్యం అమ్మకం సక్రమంగా జరిగేందుకూ, దొంగవ్యాపారాన్ని అరికట్టేందుకూ విశేషమైన కృషి జరుపబడింది. మంగళగిరి వుదంతం ఇందుకు చక్కటి వుదాహరణ.

మంగళగిరి గ్రామం గుంటూరుజిల్లాలోని ఒక పెద్దగ్రామం. అక్కడ డిప్టీ తాశీల్దారు బియ్యానికీ. జొన్నలకూ కంట్రోలురేట్లు ప్రకటించి, ఆ ధరలకు మించి షాహుకార్లెవరూ అమ్మకూడదని హెచ్చరించాడు. చుట్టుపట్ల చాలా గ్రామాలు బియ్యానికీ, జొన్నలకూ మంగళగిరిపై ఆధారపడివున్నవి. ప్రతి గ్రామానికి డిప్టీ తాశీల్దారు కొందరు చిల్లరవర్తకులకు పెర్మిట్లు యిచ్చాడు.

అయితే మంగళగిరి షాహుకార్లు తాశీల్దారు వుత్తర్వును ఖాతరుచేయలేదు. కంట్రోలురేటుకు మించి అదనంగా 3, 4 రూపాయిలు యిస్తేనేగాని పర్మిటుదార్లకు అమ్మేవారు కారు. ఈ అక్రమాన్ని గురించి పర్మిటుదార్లు అధికారులకు చెప్పుకొన్నారు గాని వినిపించుకున్న నాధుడు కన్పించలేదు. కాబట్టి గత్యంతరంలేక అదనపురేట్లకే కొని అమ్మసాగారు. వీరు నెత్తి మూటలతో గ్రామాలకు తీసుకువెళ్ళి అమ్మసాగుసరికి బస్తా 1 కి 8 రూపాయిలు ఎక్కువయింది. జొన్నలధర కూడా ఇలాగే పెరిగింది. ఈ హెచ్చుధరలకు కొనలేక పేదరైతులూ కూలీలూ పస్తులు పడివుండవలసివచ్చింది.

ఆంధ్రలో రైతు ఉద్యమం

పరిస్థితు లిలాగే కొన్నాళ్ళు సాగితే అనర్థం వాటిల్లుతుందని నేలపాడు గ్రామ ప్రజా ఆహారకమిటీ 20 మంది కూలీలతోను పర్మిటుదార్లతోనూ కలిసి మంగళగిరి వెళ్ళారు. కంట్రోలు రేటుకు జొన్నలను సప్లయిచేయమని ఒక షాహుకారుని కోరగా అతను కంట్రోలురేటుకు రు. 2–8–0 ధర ఎక్కువ చెప్పారు. కంట్రోలురేటుకు కావాలంటే మరునాడుఉదయిం రమ్మన్నాడు. ఆ రాత్రియంతా ఆహారకమిటీవాట, కూలీలూ అక్కడనే పస్తులు పడుకొని మరునాడు ఉదయం మంగళగిరి ఆహారకమిటీ కార్యదర్శినీ, ఇతర పెద్దలనూ తీసుకొని షాహుకారువద్దకు వెళ్ళారు. షాహుకారు ఒంటిగంటకు వాయిదావేసాడు. తిరిగి అంతాకలిసి ఒంటిగంటకు వెళ్ళారు. తాలూకా రైతుసంఘకార్యదర్శికూడా వీరితో కలిసాడు. నేలపాడు, ఐనవోలు, వెంకటపాలెం గ్రామకరణాలు ఈవిషయము నంతటినీ తెలుసుకొని షాహుకారును మందలించారు. గ్రామంలోని ముఖ్యులంతా అచ్చటికి సమావేశమైనారు. వారికి ఆహారకమిటీ సభ్యులు పరిస్థితుల నన్నిటినీ వివరించారు. దొంగవ్యాపారస్థు లిలాగే దేశమంతటా ప్రజల ప్రాణాలతో చెలగాట మాడుచున్నారనీ, వారి ఆటల నరికట్టకపోతే దేశంలో కరువుకాటకాలు చెలరేగుతాయనీ వివరించారు.

దీనితో విల్వ వ్యాపారస్థుడు ఇక లాభం లేదనుకున్నాడు. తన గోడౌన్ తలుపులు తెరచి 6 బస్తాల జొన్నలు బైట పడవేసాడు. ఇంతలో నలుగురు పర్మిటు దారులు అక్కడకు వచ్చారు. వీరు అదివరలో అదనపు ధరలిచ్చి సరుకును కొన్నవారే. వీరందరికీ కంట్రోలు రేట్లకు సరుకు లభించింది.

బస్తాలన్నీ కాటా వేయవలసిన సమయం వచ్చింది. షాహుకారు మొదట కాటావేయ నిరాకరించాడు. కారణం ప్రతి బస్తాలోనూ 6 సేర్లు తరుగువుంది. కాని లాభం లేకపోయింది. బస్తాలన్నీ సక్రమంగా కాటావేసి తరుగు ధాన్యం కూడా యివ్వవలసి వచ్చింది.

చివరకు షాహుకారు మరో మడత పేచీ పెట్టాడు. సంచిలేకుండా సరుకు సప్లయి చేస్తానన్నాడు. ఆహార కమిటీ ప్రతినిధులు వెంటనే కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుకు టెలిగ్రాం యివ్వబోయారు. షాహుకారు గజగజ లాడుతూ సంచిని కూడా యిచ్చివేసాడు. అంతకు పూర్వం బస్తాకు 2-8-0 చొ॥అదనంగా యిచ్చి 9 బస్తాలు జొన్నలుకొన్న కంతేటి గ్రామంలోని ఒక పర్మిటుదారుకు, విధిలేక, సొమ్మును ముజరాకూడా యివ్వవలసి వచ్చింది. ఈ విధంగా రాష్ట్రమంతటా ధాన్యం దొంగవ్యాపారాన్ని అరికట్టుటకై విశేషమగు కృషి జరిగింది.

43

# కరువునివారణకై పంటల పండించడమే దేశభక్తి

వేయరా వేయరా వరినారు
వేగంగ వేయరా వరినారు
డొక్కనిండా మేతదొరికి జోడెద్దులూ
మట్టలెగబట్టి రంకేసి దూకాలిరా
వేయరా వేయరా వరినారు
విందుగా, దండిగా వరినారు.
కరువు రోగాలతో బరువుతో సగమైన
వంగ సోదరుడింక బ్రతికి బైటపడాలి
వేయరా వేయరా వరినారు
వేవేగ వేయరా వరినారు
పల్నాడి గడ్డలో విశాఖ సీమలో
కరువు రాకాసినీ తరిమి కొట్టాలిరా
వేయరా వేయరా వరినారు
చొక్కంగ వేయరా వరినారు

— ప్రయాగ కోదండరామశాస్త్రి

బెంగాల్‌లో కరువువల్ల 36 లక్షలమంది పేద రైతులూ, కూలీలూ చనిపోయారు. 15½ లక్షల మంది రైతులు నేడు దిక్కులేనిపక్షుల్లాగ కూటికి గుడ్డకు మొగంవాచి భిక్షాటన చేసుకుంటున్నారు. రాయలసీమలో 5 లక్షలకు పైగా పేద ప్రజానీకం కరవు క్యాంపులలో రాళ్లు పగలగొట్టుతూ జీవించవలసి వచ్చింది. ఉత్తర విశాఖలో తిండిలేక కరువు వాతబడి 40,000 కు పైగా ప్రజలు మరణించారు. దేశమంతా ఒక శ్మశాన వాటికగా తయారు కాజొచ్చింది. ఇటువంటి సందర్భంలో రైతు, దేశ వెన్నుముక యని కీర్తిపొందిన రైతు, అన్నదాత యని వాసికెక్కిన రైతు, మధుక్షీరములు పొంగి పొరలే పంట తల్లియని భారతావని ప్రతిష్ట నొందుటకు కారణమైన రైతుయొక్క కర్తవ్య మేమిటి? తన నామమును సార్ధకం జేసుకొనుటకు, తన సోదరాంధ్రులను బ్రతికించుకొనుటకు చేయవలసిన కృషి యేమిటి? ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం దేశరక్షణ కవుసరమైన

ఈ మార్గాన్నే చూపింది: రైతాంగమును కర్తవ్యోన్ముఖుల గావించింది. ఈ కరువు పరిస్థితులలో ఎక్కువ పంటలను పండించటమే రైతాంగముయొక్క దేశభక్తిపూరితమైన కర్తవ్యం. ప్రతి గ్రామమునా స్వయంకృషి, స్వయం సహాయములపై ఆధారపడునట్టి వుద్యమాన్ని బయలుదేరదీయటంవల్లనే ఈకృషి సార్ధకం కాగలదు. గ్రామంలోని రైతులు, వ్యవసాయకూలీలు మొదలగు ఇతర ప్రజాసామాన్యంతో కలిసి వారి సహకారంతో ఎక్కువగా ఆహారం పండించట మనేదే ఈ స్వయం సహాయంలోని కీలకం.

ఎక్కువగా పండించాలన్న సంకల్పం వున్నంతమాత్రముననే పంటలధికం కావు. దానికై కృషిచేయాలి వున్న అడ్డంకులను తొలగించుకుపోవాలి. కొండ చిలువవలె పడివుండే ప్రభుత్వాని మేల్కొల్పి పనిసాగించాలి: ప్రభుత్వం కదలక పోయినా రైతులే, తమ ప్రజలను రక్షించుకోవలసినవారు తామే కాబట్టి, తమ స్వంతఖర్చులతోనైనా, స్వశక్తితోనైనా అధికాహారోత్పత్తికి పూనుకోవాలి. స్వాతంత్ర పోరాటంలో తుపాకిగుండ్లకు రొమ్ము నెదురీయటం ఎంతవీరత్వమో ఏ పత్తికొండతాలూకాలోనో వున్న ఒక కూలివానికి ఇన్ని గంజినీళ్ళు పోస్తానికై నర్సాపురం తాలూకారైతులు తమ స్వంత ఖర్చుతో కాల్వలుతవ్వి పంటలు పండించటం అంత మహత్వమూను. పండిన పంటను కాజేసి అధికలాభాలకై ప్రజల మానప్రాణాలను బలిగొనటం పిసాచాలబోలిన దొంగవ్యాపారుల నైజ గుణం. ఎక్కువగా పంటలపండించి తన పొరుగువాని కుటుంబాన్ని రక్షించటం అన్నదాతయగు రైతుకర్తవ్యం. ఈ ఉత్తమదేశభక్తినే, ఈ మానవసేవాపరతినే ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం ఆంధ్ర రైతాంగంలో ప్రేరేపించింది ఈ మహదాశయ ప్రేరితులు కావటంవల్లనే, ప్రభుత్వం విఫలమైన సందర్భాలలోకూడా రైతాంగం ముందంజవేసి, జలాధారాల మరమ్మతులుచేసి, అధికాహారోత్పత్తి గావించింది.

## కృష్ణకాల్వల మరమ్మతు

కృష్ణకాల్వలక్రింద 5,80,000 ఎకరాల పల్లపుభూమి సాగు అవుతోంది. ఈ కాల్వల మొగలలో ఒండ్రుమట్టి పేరుకొనిపోయి ఈ ఆయకట్టు భూమి కంతటికి నీరు సరిగా సప్లయి కావటంలేదు. అంతేగాకుండా సాగుకు పనికివచ్చే 40,000 ఎకరాలభూమి అక్కడక్కడా డెల్టా అంతటా బంజరుగా పడివుంది. కాబట్టి కాల్వలలోని ఒండ్రుమట్టిని తీసివేసి, కొన్ని మరమ్మతులను గనుక చేసినచో 5,80,000 ఎకరాల ఆయకట్టుకూ ధారాళంగా నీరు సప్లయి అవటమే గాక, 40,000 ఎకరాల బంజరు సాగులోనికి రాగలదు. అందుచే రైతుసంఘం

కరువు నివారణకై పంటల పండించటమే దేశభక్తి

ఆందోళనపై ప్రభుత్వం ఈమరమ్మతులను చేయించుటకు అంగీకరించి సొమ్మును మంజూరుచేసింది. కాని ప్రభుత్వం ఇచ్చేరేటు, ఒంగ్రుమట్టి తవ్వుపనికి గజం 1 కి 0-5-0 మాత్రమే. ఈ రేటుకు కూలీలెవ్వరూ రాకపోయారు. అందుచే, చివరి నిముషంలో కంట్రాక్టర్లు కాళ్లు పారజాపారు. తాము మరమ్మతులను చేయించలేమన్నారు. పి. డబ్లుయు. డి. వారు మరమ్మతులను ఒక సంవత్సరం వాయిదా వేద్దామనుకొన్నారు. అంటే, కరువుతో మాడిపోతున్న రాయలసీమ, విశాఖ ప్రజలకు ఇంకో సంవత్సరం కాచుకు కూర్చోమని చెప్పట మన్నమాట. ప్రభుత్వం ఈ విధంగా నిర్దాక్షిణ్యంగా వూరుకోవచ్చుగాని దేశభక్తులెట్లు వూరు కుంటారు? అన్నదాత లెట్లు అన్నాతురులను మాడిపోనిస్తారు? ఈ తవ్వుపనిని సకాలంలో, అనగా ది 20-5-44 లోగా పూర్తిజేయుటకు ఆంధ్రరాష్ట్రరైతుసంఘం బాధ్యత తీసుకొన్నది. ప్రభుత్వం శాంక్షను చేసిన డబ్బుగాక, అనగా గజం 1 కి 0-5-0 కాక 0-7-0 చొ॥ కూలియిచ్చి, అదనంగాఅయ్యే ఖర్చును (సుమారు 15 వందలు) స్వంతంగా భరించి అధికాహారోత్పత్తికి తోడ్పడాలనీ, సోదర ప్రజల ప్రాణాలను కాపాడాలనీ పూనుకొన్నది. ఈ మహత్కార్యానికి తోడ్పడ మని రైతాంగానికీ, కూలీలకూ దేశభక్తులందరికీ విజ్ఞప్తి గావించింది.

ఈ పనియంతా అనుకున్న గడువులోపల పూర్తిచేయాలంటే కనీసం 3000 మంది కావాలి. గడువు నెలరోజులుకూడా లేదు. మంచిపని తరుణం. కూలీలుకూడా ఎక్కువగా దొరకరు. 13-5-44 వరకూ మొత్తం 1500 వందల మంది కంటె ఎక్కువమంది పనివాండ్రులేరు. కాబట్టి కృష్ణా గుంటూరు జిల్లాలలోని రైతు వ్యవసాయ కూలీ సంఘాల వర్కర్లందరూవచ్చి పని చేయవల సిందిగా రాష్ట్ర రైతుసంఘంకోరింది. ఈజిల్లాలలోవున్న కమ్యూనిస్టుపార్టీ సభ్యులందరూవచ్చి పనిలో పాల్గొనవలసినదిగా ఆంధ్రా కమ్యూనిస్టుకమిటీ కోరింది. ఫలితంగా 1000 మంది వర్కర్లు 2, 3 రోజులలోవచ్చి పనిలో ప్రవేశించారు. చరిత్రాత్మక మగు కృష్ణ కాల్వల మరమ్మతు ప్రారంభమైంది.

ఎవరు ఈ కాల్వ మరమ్మతులలో పనిచేసింది? ఒక్కసారి కాల్వ పొడుగునా వెళ్ళిచూస్తే తెలుస్తుంది.

ఈ పని చేసేవారిలో వృద్ధులు, యువకులు, ముక్కుపచ్చలారని బాలురు సహితం వున్నారు. రైతులు, వ్యవసాయకూలీలు, విద్యార్థులు, మేధావులు, పట్టణ కార్మికులు, వార్ టెక్నీషియన్లూ అన్ని తరగతులవారూ వున్నారు. భీమవరపు కృష్ణారెడ్డి (పొద్దుటూరు) గన్నె సత్యం (నల్లూరు) గార్లు చెరివందల ఎకరాల ఆసామీలు. పారతోతవ్వి మట్టితట్ట లెత్తుతున్నారు. ఇంకా కొంచెం

ముందుకు సాగుతే నవనవలాడుతూవున్న విద్యార్థులు తట్టలు మోస్తున్నారు. పారలతో మట్టి తవ్వుతున్నారు. ఆపక్కనే వారికి హుషారిస్తూ, 60 ఏండ్ల పైబడ్డ గుత్తికొండ అచ్చయ్యగారు, కాంగ్రెసు వుద్యమంలో ఎంతో త్యాగం చేసినవారు, పని జేస్తున్నారు. పిలువు విన్నదే తడవుగా చేతిలోవున్న స్వంతపనుల నన్నిటినీ మూలబెట్టి కాలవపనికి వచ్చారు. మరొకచోట తలపాగ, పండుగడ్డం, దట్టీ బిగించిన పంచెకట్టుతో మరొక 60 ఏండ్ల వృద్ధు జిల్లెల వెంకయ్యగారు



కృష్ణకాల్వల త్రవ్వపని దృశ్యం

(దావాజీగూడెం) తవ్వుతున్నారు. ఇంకొకచోట, సెలవుదినం కావటంవల్ల ప్రెస్ పనివారూ, ఇతర కార్మికులూవచ్చి, మామూలు తవ్వ పనివారలకన్న ఎక్కువ ఉత్సాహంతో పనిచేయ ప్రారంభించారు.

ఉదయభారతి గురుకులం బెజవాడలో ఒక జాతీయ పాఠశాల. దీని నిర్వాహకులు, కవి, సహృదయుడూ అగు పాటిబండ్ల మాధవశర్మగారు, కాలువ పనులలో రైతుసంఘ సభ్యులు గావిస్తున్న పనిని జూచి వుత్తేజితులయ్యారు. ఈ విధంగా రైతులు కష్టపడటంవల్ల తనబోటి పట్టణవాస్తవ్యుల కేలాగు ఆహారం సమకూడుతోందో గుర్తించారు. తనవంతు సాయంచేయాలని తలచారు. ఒకనాడు వేకువజామున తన శిష్యబృందాన్నీ, తోటి అధ్యాపకులనూ

వెంటబెట్టుకొని కాల్వకు విచ్చేసారు. అందరికీ శక్తికితగిన పని నిర్ణయించ బడింది. మోయగల బాలకులంతా తట్టలను మోసారు. గట్టుపైని కాళీ అయి పడుతూవున్న తట్టలను, పాలబుగ్గల పసిపాపలు కేరింతలు కొడుతూ క్రిందికి అందించారు. మరికొందరు బాలికలు మంచినీళ్ళు అందించారు. చుట్టుపక్కల వారు ఈ దృశ్యాన్ని చూసి ముగ్ధులైపోయారు. ఇదేవిధంగా పటమటనుంచి ఒక వుపాధ్యాయుడు 20 మంది బాలకులతోవచ్చి సాయంజేసాడు. గుంటూరుజిల్లా నుండి ముగ్గురు వుపాధ్యాయులువచ్చి స్వయంగా పారబట్టి పనిజేసారు.

బెజవాడ రైల్వేకార్మికులు కొందరూ, గుంటూరునుండి లాగుడుబండ్ల వారు కొందరూ వచ్చారు. తమయింటి అవుసరాలకు బియ్యంబస్తాలు మోస్తున్నారా అన్నంత సంతోషంతో పనిజేశారు. షాప్ ఎంప్లాయీస్ యూనియన్ సభ్యులు, తోళ్ళ పనివారు, మొదలైన అనేక కార్మిక సంస్థలవారు ప్రతివారం సెలవు రోజులలోవచ్చి కాల్వ మరమ్మతులలో పనిజేసి పోతూవుండేవారు. "అధికపంటలు పండించి కరువుకాటకాల నాశనం చేస్తానికి మాకూ బాధ్యత వున్నది" అని కార్మికలోకం ఈ విధంగా రైతులోకానికి క్రియా రూపకంగా హామీ యిచ్చింది. గ్రామ, పట్టణ ప్రజల సామరస్యానికి మార్గ దర్శకులైనారు.

ఇదంతా చూస్తూవుండగా బెజవాడ మహిళాలోకంలో ఉత్సాహంప్రబలింది. వారుకూడా వచ్చి పనిచేయ వుద్యమించారు. మొదట్లో వారి ప్రవేశానికి అంగీకరించక పోయినా. చివరికి లొంగక తప్పిందికాదు. కృష్ణాజిల్లా మహిళాసంఘ కార్యవర్గసభ్యులూ, రాష్ట్ర ఆర్గనైజరు మానికొండ సూర్యావతిగారు, డాక్టరు అచ్చమాంబగారు, మానికొండ బుల్లెమ్మగారు మున్నగువారంతావచ్చి పారలతో తవ్వి తట్టలతో మోసారు.

ధనికరైతు, కాంగ్రెసువాది అయిన కాట్రగడ్డ రఘురామయ్యగారు ఉత్సాహంతో వచ్చి కాల్వపనిలో పాల్గొన్నారు. వారి సోదరులు భవాని, నారాయణ రావుగార్లు వీలైనప్పుడల్లావచ్చి సాయపడుతూ వుండేవారు. రఘురామయ్యగారు తాను పాల్గొనుటమేగాకుండా పటమట గ్రామయువకుల్ని, పెద్దల్నికూడా ఉత్సాహ పరచి పాల్గొనేలాగు చేసారు. ఈ మరమ్మతులవల్ల తమకేమీ ప్రయోజనం లేక పోయినా ప్రజాసేవా తత్పరతయే వీరినిలా ప్రోత్సహించింది.

ఈ విధంగా రైతు, కూలీసంఘసభ్యులూ, ప్రముఖరైతులూ, మేధావులూ కలిసి పారా, తట్టా పట్టి కూలీలతో కలిసి పనిజేయటం అపూర్వం. జిల్లాలో అన్నిమూలలా ఈ విషయాన్నిగూర్చి చెప్పుకోసాగారు. "కమ్యూనిస్టులంటే ఏమిటో ననుకున్నాం. వారి కార్యదీక్షను ఈ నాడు కళ్ళారాజూసాను. బాగుంది

నాయనా మీ పని" అని ఆశీర్వదించాడొక రైతుపెద్ద. పటమటనుండీ కొంత మంది రైతు స్త్రీలు వంటశాలలలో పనిచేయటానికి తమంతట తాము ముందుకు వచ్చారు. కొందరు కూరలు పంపించారు. పని ముగించుకొని స్నానాలకు పోతూవుంటే "మా యిళ్ళల్లోనే నూతులున్నవి స్నానంచేసానికి రండి" అని ఆహ్వానించారు యనమలకుదురు రైతులు. నీళ్ళుచేదుకోబోతే "ఇంతసేపూ చేతులు పుళ్ళుపడేటట్లు పనిచేసారు. మీ రెందకు చేదడం" అని తామే నీళ్ళు చేది పోశారు. ఇలా నడుంవంచి పనిచేసేదంతా తమ బిడ్డలు అలా చెమటోడ్చేద మంతా తమపంట లభివృద్ధికోసం. కరువు రాక్షసినుండి దేశాన్ని కాపాడటం కోసం అలాంటి రైతుబిడ్డలపట్ల రైతాంగం సానుభూతి చూపటం సహజమేకదా.

"నా జన్మలో ఇలాంటిది చూడలేదు" అన్నాడొక ఓవర్సీరు. ప్రజలతో సంబంధంలేకుండా, వారి సానుభూతితో పనిలేకుండా, ఒక ఆశయం లేకుండా కేవలం మెకానికల్‌గా పనులు జరిపే ప్రభుత్వపు అధికారవర్గానికిది కొత్త కావడంలో ఆశ్చర్యమేముంది?

అధికార వర్గానికీ, ప్రజా సంస్థలకూ తారతమ్యం పనివాళ్ళచేత పనిని చేయించటంలోనే కాదు. పని సాగుతూవున్నంత కాలం పనివారి నిత్యజీవనాన్ని గూర్చి శ్రద్ధ తీసుకోవడంలోకూడా ప్రజా సంస్థలు అధికారవర్గాలకు పాఠాలు నేర్పుచున్నవి. కరువు క్యాంపులలో కూలీల సౌకర్యాలెట్లా వుంటాయో మనం చూసిందే. కాని కాల్వపనులలో పనిజేసేవారి సదుపాయలకై రైతుసంఘం చక్కటి ఏర్పాట్లను గావించింది. పనివారికి కంట్రోలు ధరలకు బియ్యం ఇతర సరుకులు దొరికే ఏర్పాట్లు జరిగినవి. దెబ్బలు తగిలినవారికై చికిత్సా సౌకర్యాల నేర్పాటు జేసారు. రైతుసంఘ సభ్యులైనవారికి సమిష్టి భోజనశాల నేర్పాటు జేసారు. అన్నిటిని మించినదేమంటే, పగలంతా పనిజేసీ అలసిపోయిన వారికి సాయంత్రం కొంతసేపు వినోద కార్యక్రమం. కమ్యూనిస్టుపార్టీ వైజ్ఞానిక దళాలు ప్రతిరోజూ అక్కడక్కడా బుర్రకథలు చెబుతూవుండేవి. ఉప్పరులు ఈ బుర్రకథలద్వారా తమలాంటి కష్టజీవులు చైతన్యంపొంది, ప్రజా సంఘాల క్రింద సంఘటితమై ఎంతలేసి ఘనకార్యాలు సాధించారో ఈ కథలద్వారా తెలుసుకొనేవారు. "ఈ బాబులుచెప్పే రాజ్యంలో పని దొరకదనే బాధవుండదు భోజనం లేదనే భయంవుండదు." అన్నది ఎఱ్ఱజండాను చూపిస్తూ ఒక వుప్పర స్త్రీ. "ఆ జండా మన జండా-కూలీల జండా. ప్రాణంతో సమానంగా దానిని కాపాడుకోవాలి" అన్నాడు ఒక వుప్పర మేస్త్రీ.

# రైతాంగంలో అపూర్వ సంచలనం

ప్రజలకు క్షేమం కూర్చగల కార్యక్రమాన్ని నిరంకుశ ప్రభుత్వ అధికార వర్గాలకన్నా ప్రజాసంస్థలే, మహదాశయ పూరితులగు రైతులే జయప్రదంగా నిర్వహించగలరని ఈ కృష్ణకాల్వల మరమ్మతు రుజువు చేస్తోంది. ప్రజలలో ఇమిడివున్న నిర్మాణశక్తులు అవకాశంకల్గితే ఎలాంటిఘనకార్యాలను సాధించగలవో ఈఘటన నిరూపిస్తోంది. ఈ కృష్ణకాల్వల మరమ్మలవల్ల ఆంధ్ర రైతాంగం ఒక నూతన మార్గాన్ని తొక్కింది. స్వయంకృషి, స్వయం సహాయములవల్లనే నేటి విషమ పరిస్థితులను పరిష్కరించగలమని గుర్తించింది. అందుచే కృష్ణకాల్వల మరమ్మతులను మార్గదర్శకంగా తీసికొని అనేక ప్రాంతాలలో రైతులు, రైతు సంఘాలు స్వయంగా జలాధారాల మరమ్మతులకు పూనుకొన్నారు.

పశ్చిమ గోదావరిజిల్లాలో కోడేరు బ్యాంకుకాలవ మరమ్మతులేక మెరక వేసింది. ఇందువల్ల 30 గ్రామాల భూములకు సరిగా నీటిసరఫరాలేదు. కాల్వ త్రవ్వబడకపోతే75,000ఎకరాలకు నీరు సరిగాసప్లయి గాక1,50,000బస్తాలధాన్యం ప్రధమ పంటలోనే తగ్గిపోగలదు. అందువల్ల నర్సాపురం తాలూకా రైతుసంఘం తన కర్తవ్యాన్ని గుర్తించింది. కాదికాహారోత్పత్తి కొరకై కాల్వను త్రవ్వించి తీరాలనుకున్నది. కరపత్రాలద్వారా, సభలద్వారా 25 గ్రామాలలోప్రచారంచేసింది. రైతుసంఘం కృషికి కొందరు కాంగ్రెసు పెద్దలూ, రైతు పెద్దలూ తోడ్పడ్డారు. 20-1-14 న కోడేరు బ్యాంకుకాల్వ సభ ఆచంటలో ఏర్పాటు చేయబడింది. ఆ ఏడాదే కాల్వను త్రవ్వించి తీరాలని సభలో ఏకాభిప్రాయాన్ని వెల్లడించారు. ఇందుకు కాంగ్రెసు, జస్టిసు, రైతుసంఘాల ప్రతినిధులు గల ఒక కార్యవర్గం ఏర్పాటు చేయబడింది. మరమ్మతులకు రైతుసంఘం కాంట్రాక్టు తీసుకొన్నది. కొంతభాగం మామూలు కంట్రాక్టర్లు తీసుకొన్నారు. రైతుసంఘానికి వ్యవసాయ కూలీసంఘం తోడ్పడింది. మరమ్మతులు సకాలంలో సవ్యంగా పూర్తిచేయబడ్డవి.

కుప్పురుపాడు నెల్లూరుజిల్లాలో ఒక శ్రోత్రియంగ్రామం. ఇక్కడ చెరువు తెగిపోయి సాగులు విశేషంగా దెబ్బ తింటున్నవి. శ్రోత్రియందారు అజా పజా లేకుండా అదృశ్యమైనాడు మరమ్మతు చేయించవలసివస్తుందని. ఇక లాభం లేదని రైతులు రైతుసంఘ నాయకత్వాన మరమ్మతులకు పూనుకొన్నారు. వృద్ధులూ, యువకులూ అందరూ కలిసి పనిచేసారు, వీరికి ఎర్రజండా నీడన పనిచేయవచ్చిన 200 మంది కూలీలు సహాయపడ్డారు. ఒకరికొకరు పోటీపడి

అద్భుతంగా కృషిజేసారు. ఒక్కరోజులో 200 మంది 700 కుంటగజాలకు పైగా మట్టితీసి కట్టకువేసారు. ఈ విధంగా కుప్పురుపాడు రైతులు అధికాహారోత్పత్తికి తోడ్పడి ఇతరులకు మార్గదర్శకులైనారు.

ఆత్మకూరు తాలూకాలో (నెల్లూరుజిల్లా) పెళ్ళేరుకాల్వ సరిగా తవ్వబడక పోవుటచే, ఆయకట్టు 2000 ఎకరాలకు నీటిసప్లయి సరిగా వుండటంలేదు. అందుచే ఈ కాల్వను మరమ్మతు చేద్దామని తాలూకా రైతుసంఘం రైతులను ప్రోత్సహించింది. కాని ఒకరిద్దరు భూస్వాముల ఆటంకం మూలకంగా ఇది జరుగలేదు. అలాగే మరొక కొత్తకాల్వను తవ్వటానికి ప్రయత్నాలు జరుగగా ఒకరిద్దరు భూస్వాముల ఆటంకాలవల్ల అదికూడా ఆగిపోయింది. కాబట్టి ఇది వరకు కొంత తవ్వి వదిలివేసిన 'బాబూరావుకాల్వ'ను తవ్వించాలని రైతు సంఘం నిశ్చయించింది. కనీసం 8000 రూపాయిలపని. ఈ సొమ్మునంతా రైతులే భరించి తవ్వించ రైతుసంఘ సమావేశంలో నిశ్చయింపబడింది. 60 మంది రైతులు అగ్రిమెంటు వ్రాసుకొని తాలూకా రైతుసంఘ నాయకుడగు కామ్రేడ్ జి. సి. కొండయ్యవద్ద వుంచారు. ప్రతిరోజూ 500 మంది అహర్నిశలూ పనిజేసి సకాలంలో కాల్వను తవ్వివేసారు. ఒక్క నెలరోజులలో 2 మైళ్ళ పొడవు కాల్వను పట్టుదలతో తవ్వి కృత కృత్యులైనారు. తాము సాధించిన ఈ విజయానికి సంతోష సూచకంగా 3000 మంది రైతులు సమావేశమై కాల్వ ప్రారంభోత్సవాన్ని గావించారు.

ఒకటికాదు, రెండుకాదు: వందలకొలది గ్రామాలలో ఇటువంటి స్వయం కృషి జరిగింది. విశాఖపట్నం జిల్లాలో అనకాపల్లి తాలూకా రైతుసంఘం అనేక జమీందారీ చెర్వులను మరమ్మతు చేయించింది. తూ. గో. పెదపూడి గ్రామంలో రైతులే స్వయంగా 3 మైళ్ళ పొడవున కాల్వ పూడికను తీసివేసారు. ప. గో. లో లింగనబోయినచర్ల గ్రామరైతులు 3 మైళ్ళకు పైగా కాల్వను స్వయంగానే తవ్వుకున్నారు. కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో యిది రైతుల మామూలు కార్యక్రమమైపోయింది. ఎన్నికాల్వలు, ఎన్ని చెర్వులు మరమ్మతులు కాబడ్డవో లెక్కజెప్పటం అసంభవం. ఈ విధంగా రైతుజీవిత పథంలో ఒక నూతన మార్పు తొక్కబడింది.

అధికాహారోత్పత్తి కార్యక్రమము భుక్తికిమాత్రమేకాదు: ముక్తి మార్గంకూడా అదే. ఈ కార్యక్రమాన్ని తీసుకొని తీవ్రకృషిని గావించటం వల్లనే ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం ఎన్నో విజయాలను పొంది రైతాంగ హక్కులను సాధించింది. రైతుసంఘాలుపుట్టినది మొదలు జమీందారీ జలాధారాలను

ప్రభుత్వమే వశపర్చుకొని మరమ్మతులు చేయాలని ఆందోళన సాగించాము. కాని ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ తీవ్రకృషివల్ల ప్రభుత్వమే జమీందారీ జలాధారాల మరమ్మతులకై బాధ్యత వహించేచట్టం గావించబడింది. జమీందార్ల చేతుల్లో ఇరుకొక్కని లక్షలాది ఎకరాల భూమి బంజరుగా వున్నది. కుడితితొట్టిలో పడు కొని కుక్క తాను కుడితిత్రాగక ఎద్దును తాగనివ్వక ఎట్లుఅడ్డువస్తుందో అట్లే ఈ జమీందార్లు తాము ఆ బంజర్లను సాగు చేయరు: సాగు వేయుటకు రైతులకూ ఇవ్వరు. సాగుకిస్తే ఎక్కడ జిరాయితీ హక్కు రైతులకేర్పడుతుందోనని వీరిభయం. కరువుకాటకాలు దేశాన్నంతటినీ పిప్పిపిప్పిచేసివేస్తున్నా ఈ పెద్ద మను ష్యులు బంజర్లను సాగులోనికి తే ప్రయత్నించలేరు. అందుచే ఈ బంజర్లనన్ని టినీ విధిగా సాగులోనికి తెస్తానికై రైతులకు ఇప్పించాలని ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం ఆందోళన గావించింది. చివరకు ప్రభుత్వం, ఇట్టిబంజరు భూములను సాగులోనికి తెస్తానికై ఒక చట్టాన్ని గావించింది. మన రాష్ట్రంలో సుమారు 2300 ఈనాముగ్రామాలున్నవి. వీటిలో వున్న రైతులకందరికీ జిరాయితీ హక్కుకు సున్నచుట్టే హైకోర్టు తీర్పులు కొన్నివచ్చినవి. ఈనాందార్ల జులుం ప్రారంభమయింది. రైతులను భూములనుంచి వెళ్ళగొట్ట సాగించారు ఈ సమ యంలో ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం తీవ్రమగు ఆందోళనను గావించింది. ప్రభుత్వం వద్దకు అనేక రాయబారాలు నడిపింది. ఫలితంగా రైతులకు జిరాయితీ హక్కును స్పష్టంగా నెలకొల్పుతూ ప్రభుత్వం శాసనం గావించింది. ఈ విధంగా రైతుల హక్కులు సాధించబడినవి.

ఆర్థికంగా రైతుకు లాభం కల్గటమేగాదు. ప్రజాజీవితంలోనే పెద్ద మార్పు కల్గింది. రైతులు తమ శక్తిని తాము గుర్తించారు. స్వయం కృషి వల్ల, ఐక్యతద్వారా, ప్రభుత్వం సాధించలేని పనులను గూడా సాధించగలమనే ధీమా వచ్చింది. నిర్మాణ యుక్తంగా కృషి జేయటంవల్లనే ప్రభుత్వాన్ని లొంగ దీయవచ్చు. ఇతర ప్రజాసామాన్యం సానుభూతినీ పొందవచ్చు. ఆ విధంగానే తమ ఇతర హక్కులను సాధించవచ్చును, అని గుర్తించారు. ఇప్పటి నుండే రైతుపెద్దలు ఉత్సాహంతో రైతుసంఘ కార్యనిర్వహణలో పాల్గొంటూ రైతు ఉద్యమానికి బలాన్ని, అనుభవాన్ని, నిలకడనూ చేకూర్చారు.

## రైతుల దేశభక్తి - దొంగవ్యాపారుల దోపిడి

రైతాంగం దేశం యెడ, సోదర ప్రజలయెడ తమ కున్న కర్తవ్యాన్ని గుర్తించి ఈ విధంగా పాటుబడుతూ వుంటే దురాశా పరులగు వ్యాపారులు,

మిల్లు యజమానులు విచ్చల విడిగా దొంగవ్యాపారాన్ని సాగించారు. బెంగా లులో ఈ తిండిదొంగలు చనిపోయిన 36, 00, 000, మందిలోనూ ప్రతిఒక్కని ప్రాణాన్ని తీసి రూ 1000 చొ॥ లాభాలు సంపాదించారని వుడ్ హెడ్ కమిటీ చెప్పింది. ఆంధ్రదేశంలోని దొంగవ్యాపారులు ఈ బెంగాలు దొంగవ్యాపారుల కన్న తక్కువ చదివినవారేమీ కాదు. ప్రజల జీవితావసర వస్తువులను స్వాధీనం జేసుకొని, ధరలను విపరీతంగా పెంచివేసి, విపరీతమగు దొంగవ్యాపారాన్ని సాగించారు. ప్రజల ప్రాణాలతో చెలగాట మాడారు. ఎరువులేమిటి, ఇనుప పని ముట్లు ఏమిటి, మందులేమిటి, బట్టలేమిటి. బియ్యమేమిటి ప్రతిజీవితావసర వస్తువునడిబజారులో అదృశ్యమై దొంగబజారులో వెలిసేది. ప్రజానాయకులమనీ, కాంగ్రెసునాయకులమనీ చాటించుకొనే మహనీయులే కొందరు ఈ దొంగవ్యాపారాన్నిసాగించారు. శవాలమీదివస్తువులను దొంగిలించేరీతిగా ప్రజలకష్టాలలో వీరు అత్యధికమగు లాభాలను రెండుచేతులా సంపాదించసాగారు. దొంగవ్యాపారం నీచమగు వృత్తియేగాదు : ఇది ప్రజాద్రోహము : దేశద్రోహము. దొంగవ్యాపారులు, వారెన్నివేషాలు వేయనీ, దేశభక్తులుగా ఎంతగా వూరేగనీ, వారుసంఘ ద్రోహులు, ప్రజాశత్రువులు. వారి ఈ ప్రజావిద్రోహకరమగు చర్యలను అరి కట్టుటే వుత్తమ దేశభక్తి: వుత్తమ ప్రజాసేవ. అందుచే ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం దొంగవ్యాపారాన్ని నిరోధించుటకయి తన సర్వశక్తులనూ కేంద్రీకరించింది. అనేక ప్రాంతాలలో గణించదగిన విజయాలను సాధించి ప్రజలకు అత్యవసరవస్తువులను అందించ గలిగింది.

ఒక పర్యాయం చింతలపూడి తాలూకాకు (ప. గో. జిల్లా) 30 జతల బండిపట్టాలు వ్యవసాయశాఖ ద్వారా తాలూకా డిమాన్‌స్ట్రేటరువద్దకు వచ్చినవి. ఆయన అందులో ఒక్క జతనయినా కంట్రోలు ధరకు అమ్మలేదు. ఎవరికో అమ్మినట్లు ఖర్చువ్రాసి. తన యింట్లో పెట్టుకొని, ఎక్కువ ఖరీదు యిచ్చినవారికి యిచ్చేవాడు. ఈ అన్యాయాన్ని గూర్చి రైతుసంఘ ప్రచారకులు ఎన్నిసార్లు చెప్పినా ఆయన పెడచెవిని బెట్టాడు.

ఈయన తన యింట్లో, గడ్డిమేటిక్రింగ 4 జతల బండిపట్టాలు దాచినట్లు స్థానిక రైతుసంఘసేవకులు, కనిపెట్టి తాశీల్దారుకు రిపోర్టు చేసారు. కాని ఆయన కల్గజేసి కోలేదు. పోలీసు సబ్‌ఇనస్పెక్టరుతో చెప్పినా ఆయనకూడా చర్యదీసికొనుటకు నిరాకరించటమేగాక, యీ విషయాన్ని డిమాన్స్ట్రేటరుతో చెప్పివేసాడు.

వెంటనే రైతుసంఘ ప్రచారకులు జిల్లా కలెక్టరుకు టెలిగ్రాం యిచ్చి గడ్డిమేటివద్ద కాపలాపెట్టారు. తక్షణమే జిల్లా వ్యవసాయాధికారి గ్రామానికి వచ్చాడు. వాలంటీర్లు గడ్డిమేటి క్రింద దాచబడిన 4 పట్టాలజతలనూ పట్టించారు.

ఈ పట్టాలు రైతులకు మంజూరు అయినట్లుగా డిమాస్ట్రేటరు లెక్కలు వ్రాసియుంచాడు. వారిలో గారపాటి రాఘవయ్యగారు ఒకరు. సీరు పట్టాలకు పిటీషను పెట్టనేలేదు. రోశయ్య అనే మరొక వ్యక్తి రైతుకానేకాదు. ఆతనికి వ్యవసాయమూ లేదు. బండీలేదు. లారీ క్లీనరుగా పనిజేస్తున్నాడు. ఇవన్నీ అప్పటికి 20 రోజులక్రితమే మంజూరైనట్లు లెక్కలలో వుంది. ఈ విషయములన్ని జిల్లా అధికారి స్వయముగాచూచి, రికార్డులు తీసుక వెళ్ళాడు.

కృష్ణాజిల్లారైతు సంఘం పలుగులూ, పారలూ, బండిపట్టాలూ కంట్రోలు రేట్లకు రైతులకు సప్లయి జేయబడుటకై తీవ్రకృషి జేస్తున్నది. బెజవాడ యినుము వర్తకానికి పెద్దకేంద్రం. యిచ్చటకు సప్లయి అవుతున్న యినుమును రైతుల కందకుండా దొంగమార్కెటుకు దాటవేయాలని వర్తకులు విశ్వ ప్రయత్నాలు జేస్తున్నారు. ఈ దొంగ విల్వలను బయటికి తీయాలని బెజవాడతాలూకా రైతుసంఘం స్థానిక కార్మిక యువజన సంఘాల సహాయంతో విఘా వేసి వుంచింది.

ఒక పర్యాయం మునగాల జమీన్ రైతుసంఘ కార్యదర్శి కామ్రేడ్ వోటు సత్యనారాయణ పరగణా రైతులకుగాను వ్యవసాయ పనిముట్లు, కిటికీ చువ్వ కొనేందుకు బెజవాడ అంతా గాలించాడు. ప్రతి కొట్టువారూ మాదగ్గర సరకు లేదంటే మాగ్గర లేదన్నారు. చివరకు ఇనపకొట్ల బజారులోవున్న చుండూరు వెంకట నాగభూషణంగారి కొట్లోవున్న గుమాస్తా టొలిశెట్టి కుటుంబరావు దొంగమార్కెటు రేట్లకు కిటికీచువ్వ, నాగలి కర్రులు, పలుగులు సప్లయి చేస్తానన్నాడు. కిటికీచువ్వ మణుగు 1కి రు 17-0-0 లు నాగలి కర్రు మణుగు 1కి రు 12-0-0 లు గడ్డపలుగు మణుగు 1కి 5-8-0 చొ॥ దొంగ మార్కెటు రేట్లకు బేరం ఖాయపడింది. అయితే సరుకు మాత్రం ఆ వర్తకుడువున్న కొట్లో లేదు. మాయాబజారులో నుండి సరుకును తెప్పిస్తానని వర్తకుడు చెప్పాడు.

కామ్రేడ్ సత్యనారాయణ జరిగిన విషయమునంతా కృష్ణాజిల్లా రైతు సంఘ ఆఫీసులో చెప్పాడు. సాయంత్రం బజారుకువెళ్ళి టొలిశెట్టికుటుంబరావుకు చుండూరు వెంకటనాగభూషణం కొట్టులో రు 100-0-0 ల నోటుయిచ్చి కిటికీ చువ్వ, నాగలికర్రులు ఇదివరకే ఖాయపడ్డ దొంగమార్కెటు ధరలకు కొన్నాడు. ఈ విషయాన్ని తెలుసుకొన్న రైతుసంఘ వర్కర్లూ, స్థానిక కమ్యూనిస్టులూ

యీ దొంగవ్యాపారి సరుకుకై పంపిన మనుష్యునిపై కావలావేసి ఆ రహస్య గిడ్డంగిని కనిపెట్టారు. ఈ రహస్యగిడ్డంగి పప్పుబజారులో వున్న పండ్లకొట్టులో వున్నది.

మరునాడు వుదయం ఈ విషయాన్నంతనూ రైతు సంఘసేవకులు బెజవాడ సబ్‌కలెక్టరుకు తెలియజేశారు. ఆ రోజుననే సబ్‌కలెక్టరు ఉత్తరువు ప్రకారం యిద్దరు కమ్మర్షియల్‌టాక్సు ఆఫీసర్లు రైతు సంఘ సేవకులతో మార్కెటుకువెళ్ళి గోడౌనును పట్టుకొన్నారు. గోడౌనులో దాదాపు 8,10 అడుగుల పొడవుగల 86 నాగలి కర్రులు, నాటుమేకులు, మరమేకులు, గొలుసులు, గొళ్ళెములు, గరిటెలు, అరఅంగుళం కిటికీచువ్వ మొదలైనవి వున్నవి. ఈ సరుకునంతటినీ ప్రభుత్వ అజమాయిషీ క్రిందకు తీసుకొన్నారు. ఆఫీసర్లు రైతుసంఘ సేవకుల కృషికి మెచ్చుకొని మరొక వ్యాపారస్థునివద్ద 200 పలుగులు కంట్రోలు ధరలకు యిప్పించారు.

1943 లో తిండి కరువు ఎంత తీవ్రంగా వచ్చిందో 1945 లో బట్టలకరువు అంత తీవ్రంగానూ వచ్చింది. తమ శరీరాల్ని కప్పుకుంటానికి కూడా గుడ్డపీలిక సహితం కరువైపోయి ఎంతోమంది మానవతులు ఆత్మహత్యలు గావించుకొన్నట్లుకూడా మనం విన్నాము. కాని బట్టలులేక ప్రజలు చస్తేనేమి తమకు కావలసినది లాభాలు అని చూసేవారు షాహుకార్లు. ఆంధ్రదేశంలో అన్నిగ్రామాలలోనూ పట్టణాలలోనూ బట్టలకై ప్రజలుపడే అగచాట్లు చెప్పనలవికాదు. ఇట్టి బట్టల దొంగ వ్యాపారాన్ని నిరోధించుటకు రైతు సంఘాలు విశేషమైన కృషిని గావించినవి.

కూనాల రామకుటుంబరావు తెనాలిలో ఒక బట్టల వర్తకుడు. ఒక నాడు తెనాలి తాలూకా రైతు సంఘాధ్యక్షుడు కామ్రేడ్ రావి చినఅమ్మయ్య ఇతని కొట్లోకివెళ్ళి 3 గజాల స్టాండర్డుగుడ్డ కావాలని అడిగాడు. గుమాస్తా 3 గజాలూ కొలిచి యిచ్చాడు. దానివిలువను ఆగుమాస్తాకు యిచ్చి బిల్లు యివ్వమని అడుగగా, చేతిలోనుండి గుడ్డను లాగుకొని "నీలాంటివాళ్ళు లాచామంది కొన్నారు. బిల్లు ఎవరికీ యివ్వము" అని తూలనాడాడు. కాని కామ్రేడ్ అమ్మయ్య పట్టుబట్టగా ఒక బిల్లు విచ్చాడు. కాని దానిమీద లైసెన్సునంబరు లేనేలేదు. ఇది అనుమానాస్పదంగా వున్నదని కామ్రేడ్ అమ్మయ్య చీరాల అసిస్టెంటు టెక్స్టయిల్ ఆఫీసరుకు రిపోర్టుచేయగా ఆయన కొట్టు సోదా జేసాడు. 107 తాన్ల స్టాండర్డు క్లాత్, అనగా దాదాపు 5000 గజాలు-రహస్యంగా దాచబడివుంది. అద్దకం వేయబడిన స్టాండర్డు క్లాత్ చీరెలు దొరికినవి. మరునాడు సాయంత్రం రామకుటుంబరావు యింటి

ప్రక్క యిల్లు సోదా చేయగా 26 తానుల స్టాండర్డు క్లాత్, 3 తానుల పాప్యులైను షర్టింగూ బయటపడ్డవి. కాని ఏకారణం చేతనో అధికార్లు రామకుటుంబరావు యిల్లుమాత్రం సోదా చేయలేదు ఈ రామకుటుంబరావే స్టాండర్డు క్లాత్ స్టాకు తనవద్ద లేదని లోగడ ప్రభుత్వానికి తెలియజేసాడు.

ఒంగోలు తాలూకా పొందూరుశివారు లక్ష్మక్కపాలెంలో ముగ్గురు బట్టల లైసెన్సుదారులు వున్నారు. వీరికి కంట్రోలు రేటుకు అమ్మే అలవాటేలేదు. మెట్టూరుమల్లు నెం 61 గజం 1కి 0-9-10 లు వుంటే వీరు రు 1-4-0 కు కూడా అమ్ముతున్నారు అంతే గాకుండా నెల్లూరు జిల్లాలోని సరిహద్దు గ్రామాలతో విపరీత లాభాలకు వ్యాపారం సాగిస్తూవున్నారు.

ఈ విషయం తెలిసి పొందూరు గ్రామ రైతు సంఘమువారు ఆ గ్రామం వెళ్ళారు లైసెన్సు దార్లను కలుసుకొని వారు చేస్తూన్నది ఎలా అక్రమమో చెప్పారు. కంట్రోలురేట్ల కమ్మమని విజ్ఞప్తి చేసారు. కాని వర్తకులు వినిపించుకోలేదు స్టాకులేదనీ, ఉన్నా తమ యిష్టంవచ్చిన రేటుకే అమ్ముతామనీ బుకాయించారు సరే. స్టాకులేదని వ్రాసి యిమ్మని రైతుసంఘ సేవకులు ఒత్తిడి తెచ్చారు. దానితో వర్తకులు దిగివచ్చారు. ఒకరు తనవద్దనున్న 2½ తానులు, ఇంకొకరు 10 గజాలూ మెట్టూరుమల్లు కంట్రోలు రేట్లకు అమ్మారు.

మూడో వర్తకుడు స్టాకులేదని మొండిపట్టు పట్టాడు. రైతు సంఘంవారు కాపలా పెట్టారు. నెల్లూరుజిల్లా మనిషి ఒకడికి 41 గజాల మెట్టూరు నెం 61 మల్లును గజం 1కి రు 1-1-6 చొ॥ అమ్మినాడు. ఆ మనిషి బట్టలమూట పట్టుకొని పోతూవుండగా కాపలావున్న రైతు సంఘసేవకులు పట్టుకున్నారు. లైసెన్సు దారువద్దకు అతనిని తీసుకొనివచ్చి, కంట్రోలు రేటుకన్న ఎక్కువగా తీసుకొన్న డబ్బును వాపసు చేయించారు. ఆవర్తకుని వద్దనున్న మిగతా స్టాకును ప్రజలకు కంట్రోలు రేటుకు అమ్మించారు.

ఇవి కేవలం వుదాహరణలు మాత్రమే. అనేక గ్రామాలలో, పట్టణాలలో ఈ కృషి జయప్రదంగా సాగుచున్నది. ఆంధ్రరాష్ట్ర హిందూమహాసభాధ్యక్షుడూ, కుబేరుడూ, అయిన చుండూరు వెంకటరెడ్డి సాగించే దగావ్యాపారాన్ని బట్ట బయలు చేసి, అధికారులకు రుజువు చేయుటచే అతని కంపెనీద్వారా జరిగే యినుము వ్యాపారం వ్యవసాయ శాఖపరం జేయబడింది. రాష్ట్రకాంగ్రెసు నాయకుడగు కల్లూరి చంద్రమౌళి, రాజమండ్రి ప్రముఖకాంగ్రెసు వాదియగు దంగేటి నారాయణస్వామి మొ॥వారికంపెనీలు సాగించే దొంగవ్యాపారం పట్టుకోబడింది, రైతుసంఘం వున్న ప్రతిగ్రామంలోనూ, దొంగవ్యాపారాన్ని యాపుమాపుటకూ

